

## ఇందులో:




13

15-4-49


# జనత



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

| సంచిక 13 | * 15–4–1949 * | వెల: ఎనిమిదణాలు |
|---|---|---|

# శాంతి ప్రియులారా! ★ ★ ★ ఏకంకండి!!

సోవియట్ యూనియన్‌తో శాంతిరాయబారాలు జరపడానికి, అమెరికా సామ్రాజ్యవాద ప్రభుత్వం నిరాకరించింది. ఆయుధ విసర్జనను గురించీ, ఆటంబాంబులు ఉపయోగించడాన్ని నిషేధించడాన్ని గురించీ, పరమాణు శక్తిని కంట్రోలులో వుంచే విషయాన్ని గురించీ సోవియట్ యూనియన్ చేసిన ప్రతిపాదనలను అమెరికా ప్రభుత్వం తిరస్కరించింది. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక నిర్మాణాన్ని గురించిన కార్యకలాపాలను చురుకుగా కొనసాగించుతోంది. అట్లాంటిక్ ఒడంబడికలో సాధ్యమైనన్ని దేశాలను ఇరికించి, తన యుద్ధకేంద్రాలను విస్తరింపజేసుకోవడానికి పన్నాగాలను పన్నుతోంది. వరుసగా జరుగుతున్న యీ సంఘటనలన్నీ మరొక క్రొత్త ప్రపంచ యుద్ధ ప్రేరేపకుల విశ్వరూపాన్ని బట్టబయలు చేస్తున్నాయి.

సామ్రాజ్యవాదుల శిబిరం మరింత ఆర్థికంగా రాజకీయంగా ఒక ప్రమాదమైన సంక్షోభంలో యిరుక్కొని పోయింది. ఈసంక్షోభం రోజు రోజుకు మరింతగా వృద్ధిపొందుతోంది. అంతర్జాతీయ అభివృద్ధి నిరోధకు లంతా అమెరికా సామ్రాజ్యవాదం నాయకత్వాన యుద్ధం ద్వారా యీ సంక్షోభంనుండి బయట పడాలని కలలు గంటున్నారు. ఇందు మూలంగానే మరొక నూతన ప్రపంచయుద్ధ ప్రమాదం నేడు తటస్థించింది. ఈ నూతన యుద్ధప్రమాదానికి వ్యతిరేకంగా ప్రపంచంలో శాంతిని ప్రేమించే వారంతా ఏకమై కలసి పోరాడాలి.

— యుద్ధప్రమాదమైతేవుంది. కాని ప్రపంచమంతటా శాంతిని ప్రేమించే శక్తులన్నీ పోరాటంలో ఏకమైనట్లయితే యీ యుద్ధప్రమాదాన్నుండి పూర్తిగా బయటపడటానికి వీలుంది. ఎందువలననగా మొదటిది: ప్రపంచంలోని వివిధదేశాలలోని ప్రజలు యుద్ధాన్నికోరడంలేదు. కొద్దిమంది యుద్ధోన్మాదులు మాత్రమే యుద్ధం కోసం అర్రులు జాస్తున్నారు.

— రెండు: వివిధదేశాలలోని ప్రజలుశాంతిని ఆభిలషించడమే గాక, వారికి శాంతిని కాపాడేందుకు తగినంత సంఘటితబలం ఉంది. ఈ బలానికి మూలప్రాతిపదిక సోషలిస్టురాజ్యమైన సోవియట్ యూనియన్, వివిధ ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలూ, పెట్టుబడిదారీ ప్రపంచంలో వున్న వివిధదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలూ, అన్నిదేశాలలోని విప్లవకర ట్రేడ్‌యూనియన్ ఉద్యమాలూ, విప్లవకర ప్రజాసంస్థలూ. ఈ బలమంతా రెండో ప్రపంచ యుద్ధంలోనూ, యుద్ధానంతర కాలంలోనూ, విపరీతంగా వృద్ధిపొందింది.

— మూడు: ఇందుమూలంగా యుద్ధప్రేరేపకులు పైకి బలంగా కనపడినప్పటికీ ప్రజలనుండి వేరుపడి, చాలా బలహీనంగా ఉన్నారు. తమలో అంతర్గతంగా వున్న విపరీతమైన పరస్పర విరుద్ధతలవలన వారు దెబ్బతినక తప్పదు; వివిధదేశాలలోని బూర్జువావర్గాలమధ్యా, ఒక దేశంలో వున్న వివిధ బూర్జువాముఠాలమధ్య నున్న పరస్పర విరుద్ధతల మూలంగా వారు బలహీనపడక తప్పదు. యుద్ధాన్ని ప్రేరేపించే శక్తుల

కంటే శాంతిని అభిలషించే శక్తులే నేడు చాల బలవత్తరంగా ఉన్నాయి. ప్రపంచంలో శాంతిని అభిలషించే శక్తులన్నీ – ముఖ్యంగా ప్రపంచ కార్మికవర్గ శక్తులన్నీ పూర్తిగా జాగ్రతవహించి, తమ శక్తులబలాన్ని తక్కువ అంచనా వేయకుండా, విరోధివర్గ శక్తులబలాన్ని అధికంగా అంచనా వేయకుండా వుండి, అందరినీ ఎడతెగని పోరాటంలో ఐక్యపరచ గలిగిన పక్షంలో యుద్ధోన్మాదులు పూర్తిగా నాశనంచేయబడతారు. నూతనయుద్ధ ప్రమాదం తప్పకుండా తొలగిపోతుంది.

నూతన ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని అధిగమించేందుకు ప్రపంచంలో శాంతి నభిలషించే శక్తులన్నీ చురుకుగా పనిచేస్తున్నాయి. శాంతికోసం పోరాడే మానవజాతి మహానాయకుడు స్టాలిన్ యీ సంవత్సరంలో రెండు సార్లు – జనవరి 30, ఫిబ్రవరి 2 న సోవియట్ యూనియన్ యొక్క ఖచ్చితమైన శాంతి విధానాన్ని గురించి ప్రకటించాడు. రెండు దేశాలకు మధ్య నున్న అభిప్రాయభేదాలను గురించి అమెరికాతో చర్చించడానికి సోవియట్ యూనియన్ యొక్క అభీష్టతను ఆయన వెల్లడించాడు. అంతేకాదు; యీ విషయమై ట్రూమన్‌తో స్వయంగా కలసి చర్చించేందుకు తన సంసిద్ధతను తెలియజేశాడు. స్టాలిన్ చేసిన యీ రెండు ప్రకటనలనూ ప్రపంచంలోని వివిధ దేశాలలోని శాంతిని అభిలషించే ప్రజలంతా అత్యంత ఉత్సాహంతో హర్షించారు.

## థోరే, టొగ్లియాటీల ప్రకటనలు

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికపై సోవియట్ యూనియన్ విదేశాంగ వ్యవహారాల మంత్రివర్గం జనవరి 28 వ తేదీన చేసిన ప్రకటన, ఆంగ్లో – అమెరికన్ సామ్రాజ్యవాదుల కూటమి దురాక్రమణ ప్లానులను పూర్తిగా బట్టబయలు చేసింది. అంతేకాదు. ఆ ప్రకటన ప్రపంచ శాంతి కాముక శక్తులను అప్రమత్తతగా వుండవలసిందిగా ఒక హెచ్చరికగా కూడా పరిణమించింది. యుద్ధానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో పెట్టుబడిదారీ ప్రపంచంలోని వివిధదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు ప్రజ [illegible] ప్రథమశ్రేణిలో నిలబడి పనిచేస్తాయి. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధం ప్రారంభించబడితే ఫ్రెంచి కార్మికవర్గమూ, ఫ్రెంచి ప్రజలూ

సోవియట్ యూనియన్‌కు అండగా నిలబడి, ఫ్రాన్సును విముక్తి పరచడానికి, దురాక్రమణదారులను తరుముకుంటూ వచ్చే సోవియట్ సైన్యాన్ని ఆహ్వానించుతామని ఫిబ్రవరి 22, 23 తేదీలలోనూ, ముఖ్యంగా 24 వ తేదీన ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ నాయకుడు కామ్రేడ్ మారిస్‌థోరే ప్రకటించాడు. సర్గ్గా అలాంటి ప్రకటనకే ఇటలీ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు కామ్రేడ్ టొగ్లియాటీ ఫిబ్రవరి 26 వ తేదీన చేశాడు. వరుసగా జరిగిన యీ ప్రకటనలు పెట్టుబడిదారీ ప్రపంచంలోని కార్మికవర్గాన్నీ, విప్లవయుత ప్రజలను బ్రహ్మాండగా సమీకరించాయి.

థోరే, టొగ్లియాటీల పిలుపు నందుకుని ఒకదానివెంట ఒకటిగా బ్రిటన్, అమెరికా, ఆస్ట్రియా, డెన్‌మార్క్, మెక్సికో, ఫిలిప్పైన్స్, స్వీడన్ అర్జంటైనా, ఆస్ట్రేలియా, బెల్జియం, నెదర్‌లాండ్సు, బ్రెజిల్ - దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలూ, జర్మనీలోని సోషలిస్టు యూనిటీ పార్టీ, కెనడాలోని వర్కర్సు ప్రోగ్రెస్సివ్ పార్టీలు అదేవిధంగా ప్రకటనలు చేశాయి. అదే సమయంలో యీ సంవత్సరం ఏప్రిల్‌లో ప్రపంచ శాంతి మహాసభ జరపాలని ప్రతిపాదించుతూ ప్రపంచ సంస్కృతీ, కళాకారుల మహాసభ సమావేశ కమిటీ, ప్రపంచ ప్రజాతంత్ర మహిళా ఫెడరేషన్ యింకా ప్రఖ్యాత సాహితీ, సంస్కృతీ, వైజ్ఞానిక కళావేత్తలూ ఒక సంయుక్త ప్రకటనను ఫిబ్రవరి 24 వ తేదీన చేశారు. ఈ ప్రతిపాదనను ప్రపంచమంతటా వున్న కార్మిక, మహిళా, యువజన, సాంస్కృతిక, మతసంస్థలూ, బలపరచాయి. శాంతిని ప్రేమించే మానవజాతిఅంతా యుద్ధోన్మాదుల కుట్రలను నాశనం చేసే ఆఖరిదెబ్బ కొట్టడానికి నేడు దీక్షబూనింది.

## శాంతి శిబిరంలోనే చైనా స్థానం

చైనా ప్రజలమైన మేము ప్రపంచశాంతి కాముక శక్తుల యీ పిలుపును ఎలాంటి సందేహం లేకుండా పరిపూర్ణంగా బలపరుస్తాం. సామ్రాజ్యవాద దురాక్రమణ యుద్ధాల భీభత్సానికి గురియైన దేశం చైనా. సామ్రాజ్యవాదులు చైనాపైకి ప్రత్యక్షంగా సాయుధదాడులు చాలకాలం చేయడమే గాక, అభివృద్ధి నిరోధకులను విప్లవప్రతిఘాత యుద్ధాన్ని చేయడానికి చాల కాలం ప్రోత్సహించారు. ఈనాటివరకూ, ఎలాంటి న్యాయసమ్మతమైన

కారణం లేకుండా అమెరికా సామ్రాజ్యవాదులు తమ సాయుధబలాలను చైనా భూభాగంలో అట్టేపెట్టడమేగాక, వారు చైనాలో మిలిటరీ కేంద్రాలను కూడా నిర్మించారు. అమెరికా సామ్రాజ్యవాదుల సాయంతో కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు జరుపుతున్న విప్లవ ప్రతీఘాత యుద్ధం యీనాటి వరకూ అంతం కాలేదు. దానికితోడు అమెరికా సామ్రాజ్యవాదులు. జపాన్ దురాక్రమణ దారులు తిరిగి తలెత్తడానికి తగిన మద్దత్తు నిస్తున్నారు.

తాము స్వయంగా బాధలు పడిన అనుభవం మూలంగా చైనా ప్రజలు సామ్రాజ్యవాద యుద్ధప్రేరేపకులను తమబద్ధ శత్రువులుగా తప్పని సరిగా పరిగణించి తీరుతారు. యుద్ధప్రేరేపక మూతాలకు నాయకత్వం వహించే అమెరికా సామ్రాజ్యవాద శక్తులను గర్భశత్రువుగానూ, ప్రపంచ సామ్రాజ్యవాద ప్రతికూలాల సంఘటనకు నాయకత్వం వహించే సోషలిస్టు మహారాజ్యం—సోవియట్ యూనియన్‌ను తుదివరకూ యుద్ధరంగంలో తన సహోదరుడుగానూ చైనాప్రజలు పరిగణించకుండా వుండలేరు.

## చైనాప్రజలకు సోవియట్ చేసిన సాయం

సోవియట్ యూనియన్ ఉద్భవించిన దగ్గరనుండీ, అది చైనాప్రజల కష్టాలయెడల సానుభూతిచూపుతూ, చైనాప్రజలకు సమాన ప్రాతిపదికపై సౌభాతృత్వదృష్టితో స్నేహపూర్వకమైన సహాయంచేసింది. ముఖ్యంగా జారుచక్రవర్తుల పరిపాలనకాలంలో, చైనాతో రష్యా చేసుకొన్న అన్యాయపు ఒడంబడికలన్నింటినీ సోవియట్ ప్రభుత్వం పూర్తిగా రద్దుపరచింది. అంతే కాదు; సామ్రాజ్యవాదానికి ప్రతికూలత చూపిన ఆనాటి జాతీయ ప్రభుత్వానికి అనేకవిధాల ఆచరణలో సాయపడింది. కాని ఆ తరువాత యీ సహాయాన్నికూడా దృష్టిలో వుంచుకోకుండా కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు తమ ద్రోహబుద్ధిని వెల్లడి చేసుకొన్నారు. యుద్ధకాలంలో జపాన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అరుణసేన క్వాంటాంగ్ సైన్యాన్ని, జపాన్ సేననూ సర్వనాశనం చేసింది. కీలుబొమ్మ మంచుకూను పరిమార్చి, జపాన్ లొంగిపోయేటట్లు చేసింది. చైనా — సోవియట్ ఒడంబడికా, జపాన్ దురాక్రమణను ప్రతిఘటించేందుకు సోవియట్ యూనియన్, చైనాలు పరస్పరం చేసుకొన్న సంధులూ, జపాన్ పతనమయ్యేముందు చేసుకొన్న

ద్వైరాన్, పోర్టుఆర్థర్ ఒడంబడికలూ – యివన్నీ దూరప్రాచ్యంలో సామ్రాజ్య వాదుల దురాక్రమణకు చావుదెబ్బలుగా పరిణమిస్తాయి. దురాక్రమణకు వ్యతిరేకంగా చైనాప్రజల ప్రయోజనాలకు గ్యారంటీని యిస్తాయి. సామ్రాజ్య వాదుల దురాక్రమణకు వ్యతిరేకంగా చైనాప్రజలు కొనసాగిస్తున్న మహత్తరమైన, జయప్రదమైన పోరాటంలోనూ, వారు నిర్మించుకోబోతున్న ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణంలోనూ, సోవియట్ యూనియన్ మిత్రత్వం ప్రముఖపాత్ర వహిస్తుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. ఈ సందర్భంలో సన్‌యట్‌సేన్ సోవియట్ యూనియన్‌కు వ్రాసిన ఆ అమర లేఖను ఉదహరించడం అప్రస్తుతంకాదు. ఆ లేఖలో ఆయన యిలా వ్రాశాడు:

"మీవద్దనుండి ఆఖరిసారిగా సెలవుపుచ్చుకొంటున్న యీ సమయంలో త్వరలోనే ఉదయభానుడు – ఉదయించుతాడనే నా గాఢమైన ఆశను వెల్లడించదలచాను. ఆనాడు సోవియట్ యూనియన్ బలమైన స్వతంత్రంచైనాను తనమిత్రుడుగానూ, సహచరుడుగానూ, ఆహ్వానించుతుందని నేను ఆశించుతున్నా. అంతేకాదు; ఈ రెండుదేశాలూ ప్రపంచంలో అణచబడ్డజాతుల స్వాతంత్ర్యంకోసం జరిగేయుద్ధాన్ని జయప్రదం చేసేందుకు ఒకరికొకరు బాసటగా నిలిచి, కలిసి ముందుకు సాగిపోతారని ఆశిస్తున్నా."

## చైనాప్రజలు సన్‌యట్‌సేన్ ఆదేశాన్ని అమలుజరుపుతారు

సామ్రాజ్యవాద దేశాలలోని దురాక్రమణశక్తులు మరొక నూతన యుద్ధాన్ని రెచ్చగొట్టడానికి సిద్ధపడిన పక్షంలో, చైనా ప్రజలూ సన్‌యట్‌సేన్ శిష్యులంతా ఆయన ఆదేశాలను ఎలాంటి సందేహం లేకుండా ఆచరణలో పెట్టితీరుతారు. ఆయన ఆదేశాలకు వ్యతిరేకంగా పోయేవారం దరికీ, యీనాడు సన్‌యట్‌సేన్ ఆశయాలకు ద్రోహంచేసినవారికీ ఎలాంటి గతిపట్టిందో అలాంటిగతే పడుతుంది.

అయితే చైనాప్రజలు తమ పోరాటంలో మహత్తరానుభవాన్ని గడించారు. వారు తమ పోరాటంలో గడించిన అనుభవమిది. "శక్తివంతమైన" సామ్రాజ్యవాదులంతా సర్వనాశనం చేయబడతారు; సామ్రాజ్య

వాదంయొక్క మిలిటరీదాడులూ, రాజకీయ వ్యూహాలనూ భగ్నపరచి, ధ్వంసంచేయవచ్చు. జపాన్ ఓడిపోయినతరువాత మూడు గడ్డు సంవత్సరాలలో చైనాప్రజలు అమెరికా సామ్రాజ్యవాదంయొక్క భయంకరమైన దాడికి, దాని తాపలాకుక్క అయిన కొమింటాంగ్ అభివృద్ధి నిరోధక ప్రభుత్వ దాడికీ గురిఅయ్యారు. ఈదాడిని చైనాప్రజలు జపాన్ సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొన్న రీతిగానే ఎదుర్కొని విజయాన్ని సాధించారు.

అమెరికా సామ్రాజ్యవాదం ఒక గుండెలుజారిన, శక్తిహీన పులి అని చైనాప్రజలకు తెలుసు. ఈ సత్యం యీనాడు యితర ప్రదేశాలలోకంటే చైనాలోనే పూర్తిగా వ్యక్తమవుతోంది.

నూతన యుద్ధప్రమాదాన్ని ఎదుర్కొనేవర్గాల కార్యకలాపాలలో చైనా ప్రజలు చురుకుగా పాల్గొనాలి. శాంతినభిలషించే కార్మిక, మహిళా యువజన, సాంస్కృతిక, మత, యింకా చైనాలోని యితర ప్రజాసంస్థలకన్న సంస్కృతీ, కళారంగాలలో కృషిచేసే చైనాలోని ప్రముఖులంతా ప్రపంచ శాంతి మహాసభకు తమ ప్రతినిధులను పంపించితీరాలి. చైనా ప్రజల ప్రతినిధులు తాము అనుభవంద్వారా తెలుసుకొన్న అమరసత్యాన్ని ప్రపంచం ముందు పెట్టాలి. ఏమిటా సత్యం? శాంతికాముకశక్తులన్నీ ఎలాంటి తప్పులూ చేయకుండా, పోరాటంలో ఐక్యమైతే అమెరికా సామ్రాజ్యవాదంయొక్క పతనం తథ్యమవుతుంది; అమెరికా సామ్రాజ్యవాదం తయారుచేస్తున్న నూతన యుద్ధప్రమాదాన్ని తప్పకుండా దాటిపోగలం.

[విముక్త చైనాలోని ప్రజాప్రభుత్వ అధికార వార్తాసంస్థ "న్యూ చైనా న్యూస్ ఏజెన్సీ" మార్చి 18 వ తేదీన ప్రకటించిన సంపాదకీయాన్ని యీక్రింద ప్రచురిస్తున్నాం. —సంపాదకవర్గం]

— చైనా డైజెస్టు నుంచి

(మార్చి 22)

౮

# స్వాతంత్ర్యయోధుడు: జూలియస్ ఫ్యూజిక్

సుప్రసిద్ధ జెక్ రచయిత అయిన జూలియస్ ఫ్యూజిక్ జగమెరిగిన స్వాతంత్ర్యయోధుడు. 'రక్తాక్షరాల' గ్రంథకర్త. అజ్ఞాతవాస సమయంలోనూ, చెరసాలల్లోనూ జర్మనీ ఫాసిస్టు కిరాతకులతో ముఖాముఖి తలపడి అగ్రశ్రేణిలో ఉండి పోరాడిన అతిరథుడు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రాణాలర్పించిన అమరజీవి.

జెకోస్లోవేకియాకు రాజధానీ నగరమైన ప్రేగ్ పట్టణ సమీపంలో వున్న స్మిచోవ్‌లో 1903 ఫిబ్రవరి 23వ తేదీన ఫ్యూజిక్ జన్మించాడు.

విద్యార్థిదశనుంచీ ఫ్యూజిక్ ప్రతిభావిశేషాలు ద్యోతకమవుతూ ఉండేవి. చరిత్ర అంటే అతనికి మహాయిష్టం. 1921 లో తత్వశాస్త్ర విద్యార్థిగా ప్రాగ్ విశ్వవిద్యాలయంలో చేరాడు.

ఆ దేసమయంలో సామాజిక శాస్త్రాన్నీ, మార్క్సిస్టు మూలగ్రంథాలనూ బహుశ్రద్ధగా అధ్యయనంచేస్తూ ఉండేవాడు. సోషలిస్టు ఉద్యమంలో పాల్గొంటూ వుండేవాడు. కమ్యూనిస్టు విద్యార్థి సంఘంలో సభ్యుడుగా చేరి త్వరలోనే ఆ సంఘానికి నాయకత్వం వహించాడు.

విశ్వవిద్యాలయంలో ఒకవైపు చదువుకుంటూనే, ఆ చదువు ఖర్చుకోసం తానొక ప్రైవేటు టీచరుగాకూడా పనిచేస్తూ ఉండేవాడు. విద్యార్థులకు ఆటలు నేర్పుతూ ఉండేవాడు. అప్పుడప్పుడు తాపీపనీ, మట్టిపనీ చేసేవాడు. బజారులవెంట నడుస్తూ అడ్వర్టైజ్‌మెంటు కేకలువేసే కుర్రవాడుగాకూడా కొంతకాలం పనిచేశాడు. ఉదరపోషణార్థం అన్ని అవస్థలు పడుతూకూడా చదువు విషయంలో మాత్రం ఎప్పుడూ అశ్రద్ధచేసేవాడు కాదు. సభల్లో, సమావేశాల్లో, ప్రదర్శనాల్లో, విద్యార్థి సంఘంయొక్క కార్యకలాపాలన్నింటిలో, చురుకుగా పాల్గొంటూ ఉండేవాడు. తర్వాత స్వయంగా ఫ్యూజిక్ చెప్పినట్లుగా అతను 'ఎప్పుడూ ముందుకే, మున్ముందుకే పురోగమించాలి' అనుకుంటూ ఉండేవాడు. గ్రంథ రచయితగానూ, పత్రికా రచయితగానూ తన జీవితం ప్రారంభించినప్పటినుంచీ, ఫ్యూజిక్ ఆనాటి జెక్ సాహిత్యంలో ఉన్న అభివృద్ధి నిరోధక భావాలన్నిటినీ తీవ్రంగా వ్యతిరేకించాడు.

చెకోస్లోవేకియానుంచి నలుగురు కార్మికులూ, ఒక పత్రికా రచయితా వచ్చి సోవియట్ యూనియన్‌ను సందర్శించవలసిందిగా 1930 లో సోవియట్ కిర్గిజియా కార్మికులు ఆహ్వానించారు. సోవియట్‌కు వెళ్లే ప్రతినిధి వర్గంలో ఒక సభ్యుడుగా ఫ్యూజిక్ ఎన్నుకోబడ్డాడు. కాని చెకోస్లోవేకియా పోలీసు అధికారులు ఇందుకు అంగీకరించలేదు. ఆ ప్రతినిధుల ప్రయాణానికి అభ్యంతరం తెలియజేశారు. సోవియట్ యూనియన్‌ను గురించిన యథార్థ విషయాలు తెలుసుకోవాలనీ, బూర్జువా పత్రికలు ప్రతినిత్యం చేసే దుష్ప్రచారాన్ని ప్రత్యక్ష సాక్ష్యంతో ఖండించాలంటే సోవియట్‌ను సందర్శించడం అవసరమనీ, ఆ ప్రతినిధులు భావించారు. ఏదోవిధంగా పోలీసు కండ్లలో దుమ్ముగొట్టి సోవియట్ యూనియన్‌కు వెళ్ళడానికే నిశ్చయించుకున్నారు. అనేక కష్టనష్టాల నెదుర్కొంటూ, అనేక ప్రాణాపాయ సంఘటనలనుంచి తప్పించుకుంటూ, చివరకు ఎలాగయితేనేం ఆ ప్రతినిధివర్గం సోవియట్ యూనియన్‌కు చేరుకుంది.

సోవియట్ యూనియన్‌లో ఫ్యూజిక్ దాదాపు ఆరు మాసాలు గడిపాడు. మాస్కో, లెనిన్‌గ్రాడ్, యూక్రెయిన్, కాకేసస్, కిర్గిజియా, తజికిస్తాన్, కజాక్‌స్తాన్, వగైరా అనేక ప్రదేశాలను సందర్శించాడు.

1930 హేమంతంలో తిరిగి ఫ్యూజిక్ తన దేశానికి చేరుకున్నాడు. భూతలస్వర్గమైన సోవియట్ యూనియన్‌నుగురించీ, అక్కడ నిర్మించబడుతూన్న నూతన సమాజాన్ని గురించీ, నూతన విజ్ఞానాన్ని గురించీ తెలుసుకోవాలని చెక్ ప్రజలు ఏవిధంగా తహతహలాడుతున్నారో ఫ్యూజిక్ గ్రహించాడు పోలీసుల బెదిరింపులనూ, నిర్బంధాలనూ తృణీకరించి సోవియట్‌నుగురించి దాదాపు వందకుపైగా సభల్లో, సమావేశాల్లో ఉపన్యసించాడు. సోవియట్ యూనియనను గురించిన యథార్థ విషయాలు ప్రజలకు తెలియజేయడం అధికారవర్గానికి సహించలేదు. ఒక బహిరంగసభలో కామ్రేడ్ ఫ్యూజిక్ ప్రసంగిస్తూఉండగా 1931 లో అతన్ని నిర్బంధించి 4 మాసాలు శిక్షవేశారు. దీనిఫలితంగా సోవియట్ యూనియన్ పై ఆనాడు ఫ్యూజిక్ వ్రాస్తూఉన్న మన 'రేపు' వారికి 'నిన్న' అనే పుస్తకం (ది లేండ్‌వ్హేర్ అవర్ టుమారో ఈజ్ ఎస్టర్‌డే) యొక్క రచన తాత్కాలికంగా కొంతకాలంవరకు ఆగిపోయింది. తర్వాత ఈ పుస్తకం 1931 లో ప్రచురించబడింది. వెంటనే అనేక భాషల్లో దీనికి అనువాదాలుకూడా వచ్చాయి.

పై గ్రంథంలో ఒక చోట ఫ్యూజిక్ ఇలా వ్రాస్తాడు:

"సోవియట్ భూమిని సందర్శించాం. కార్మికులక్కడ ఒక నూతన ప్రపంచాన్ని, ఒక నూతన సమాజాన్ని, సోషలిస్టు సమాజాన్ని – నిర్మిస్తున్నారు."

"కార్మికులు తమ స్వాతంత్ర్యం కోసం వీరోచితంగా పోరాడారు. అనేక బాధలనుభవించారు. ప్రాణాలను సైతం సమర్పించారు. చివరకు విజయం సాధించారు. తమ కష్టఫలితాన్ని నేడు అనుభవిస్తున్నారు. వారి యోగక్షేమాలు వారి చేతుల్లోనే ఉన్నాయి. రోజురోజుకూ వారు పురోగమిస్తున్నారు."

ఈ గ్రంథరచనలో కామ్రేడ్ ఫ్యూజిక్ ప్రతిభావిశేషాలు చక్కగా ప్రతిబింబించాయి. ఇది ఒక ఉత్తమ కళాఖండం.

సోవియట్ జీవితం అభ్యుదయ రచయిత అయిన ఫ్యూజిక్ హృదయంలో ఒక నూతన స్ఫూర్తిని రేకెత్తించింది. ఒక నూతన చైతన్యాన్ని కలిగించింది. ఫ్యూజిక్ రచనలు పాశ్చాత్య సాహిత్యానికి కొత్తదారులు వేశాయి. ప్రపంచసాహిత్యంలో ఒక విప్లవ జ్యోతిని వెలిగించాయి.

కళాకారుడుగా, విప్లవకారుడుగా కామ్రేడ్ ఫ్యూజిక్ సోవియట్ యూనియన్‌ను మనసారా ప్రేమించాడు. తన మాతృభూమినీ, తన ప్రాచీన సంస్కృతినీ పూర్తిగా అవగాహనచేసుకున్నాడు; ప్రేమించాడు. ప్రపంచ పీడితప్రజల స్వాతంత్ర్య పోరాటానికి సోవియట్ యూనియన్ ఎంతగా తోడ్పడుతూందో గ్రహించాడు. కాబట్టే ఫ్యూజిక్‌లో నిజమైన అంతర్జాతీయత మూర్తీభవించింది.

సోవియట్ యూనియన్‌నుంచి తిరిగి స్వదేశానికి చేరుకున్న తర్వాత జెక్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక అయిన 'రూడీ ప్రవో'కు సంపాదకుడుగా పనిచేశాడు. ఇంకా అనేక అభ్యుదయ పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు.

సోవియట్ మిత్రుడూ, పత్రికారచనలో విప్లవకారుడూ అయిన ఫ్యూజిక్ ప్రభుత్వ నిరంకుశాధికారవర్గంయొక్క 'చల్లని' చూపుకు ఎలా గురికాకుండా ఉంటాడు? అనేకసార్లు ఆయన్ని అరెస్టుచేశారు. జైళ్ళలో నిర్బంధించారు. నిర్బంధంలో ఉన్నప్పుడుకూడా ఆయన తన విప్లవకార్యక్రమాన్ని కొనసాగిస్తూనే ఉండేవాడు. నిర్బంధంలో ఉన్న సమయంలో వ్రాసిన వ్యాసాలకుగాను అనేకసార్లు జైలునుంచి బైటికిరాగానే మళ్ళీ నిర్బంధించడం జరుగుతూ ఉండేది. పోలీసుల బారినుంచి తప్పించుకోడంకోసం అనేకసార్లు అజ్ఞాతవాసానికికూడా వెళ్లుతూ ఉండేవాడు.

కామ్రేడ్ ఫ్యూజిక్ 1934 లో మరోసారి సోవియట్ యూనియన్‌కు వెళ్ళాడు. 'రూడీ ప్రవో' పత్రికా విలేఖరిగా 1936 వరకూ సోవియట్‌లోనే ఉన్నాడు. సోవియట్ యూనియన్‌లో గడపిన ఈ రెండు సంవత్సరాలూ తన జీవితంలో అత్యంత సుఖప్రదమైనవిగా ఆయన స్వయంగా ఉల్లేఖించాడు. సోవియట్ యూనియన్‌గురించి ఆయన పంపిన రిపోర్టులూ, కథలూ, జెక్ ప్రజాహృదయాన్ని అమితంగా చూరగొన్నాయి. ఒక రిపోర్టులో ఫ్యూజిక్ ఇలా వ్రాస్తాడు :-

"సోవియట్ యూనియన్‌లో దాదాపు నేను రెండు సంవత్సరాలున్నాను. నా కండ్లముందే వీధులు మారిపోతున్నాయి. నూతన పట్టణాలు నిర్మించబడుతున్నాయి. ఎటుచూచినా నూతనశోభ తొణికిసలాడుతూ ఉంది. సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో సస్యలక్ష్మి తాండవిస్తూ ఉంది. ప్రజలు మారిపోతున్నారు. ప్రాత మారిపోతూఉంది. 'కొత్త' ఉదయిస్తూ ఉంది. వృద్ధిచెందుతూఉంది. అనుదినం పురోమిస్తూఉంది. ఈ రెండు సంవత్సరాలూ చరిత్రలో కొన్ని దశాబ్దాలలాంటివి. నా స్వప్నలోకం సాకారమై నాకండ్లముందు సాక్షాత్క

రించింది. దేనికోసం మనం ఇంకా పోరాటం జరుపుతూ ఉన్నామో, కలలు కంటున్నామో అది ఇక్కడ మూడుపువ్వులూ, ఆరుకాయలుగా అభివృద్ధిచెందుతూఉంది నా కండ్ల ముందే ఒక నూతనసమాజం - వర్గరహితసమాజం - దిన దినాభివృద్ధి నందుతూఉంది. సోషలిజం రక్తమాంసాలతో ఇక్కడ మూర్తీభవించింది.”

సోవియట్ యూనియన్‌నుంచి తిరిగి మళ్ళీ స్వదేశంవచ్చినతర్వాత కామ్రేడ్ ఫ్యూజిక్, నాజీ జర్మనీవేసే దురాక్రమణ ప్లానులను బట్టబయలుచేస్తూ అనేక వ్యాసాలు వ్రాశాడు.

ఇంతలో 1938 వచ్చింది. సామ్రాజ్యవాదుల కుట్రఫలితంగా ‘మ్యూనిచ్ ఒడంబడిక’ జరిగింది. వెంటనే జెకోస్లోవేకియాలోని కమ్యూనిస్టుపత్రికలన్నీ నిషేధించబడ్డాయి. సామ్రాజ్యవాదుల కుట్రలకు లొంగిపోవద్దని ప్రజలకు విజ్ఞప్తి చేశాడు ఫ్యూజిక్. ‘సామ్రాజ్యవాదులూ, వాళ్ళ తొత్తులూ కలసి ప్రజలను అమ్మివేశారు. కాని ప్రజల ఆత్మ ఇంకా సజీవంగానేఉంది.” అని ఫ్యూజిక్ ‘సిన్’ అనే పత్రికలో వ్రాశాడు.

బహిరంగ పత్రికల్లో వచ్చిన ఆ యన వ్యాసాల్లో అదే ఆఖరుది.

లండన్ - మ్యూనిచ్ ఒడంబడికయొక్క దుష్ఫలితాలు వెంటనే ఒక్కొకటి బైటపడసాగాయి. 1938 మార్చి 15వ తేదీన నాజీ సైన్యం ప్రేగ్ నగరంలో ప్రవేశించింది. నాజీ దురాక్రమణను వ్యతిరేకించే స్వాతంత్ర్యకాముకులందరిపై నాజీ విషదృష్టి ప్రసరించింది. తండోపతండాలుగా ప్రజలను అరెస్టు చేయడం జరిగింది. ప్రజల్లో పలుకుబడి కలిగిన కొందరు రాజకీయ నాయకులను లాలించి, బెదిరించి తమవైపు రాబట్టుకోడానికి నాజీ తొత్తులు ప్రయత్నించారు. ‘కళాసంస్కృతులు’ అనే పత్రికకు సంపాదకుడుగా ఉండవలసిందని, ఫ్యూజిక్‌కు ఆహ్వానంవచ్చింది. ఆ ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ ఫ్యూజిక్ ఇలా సమాధానం ఇచ్చాడు: “నేను వ్రాయదలచుకున్న విషయమేదీ నీవు ప్రకటించవు. నీవు ప్రకటించదలచిన విషయాన్ని దేన్నీ నేను వ్రాయను.”

తర్వాత కొద్దిరోజులకు గెస్టపో అధికారులు (నాజీ గూఢచారులు) ఫ్యూజిక్ ఇంటిపై దాడిచేశారు. కాని ఫ్యూజిక్ అంతకు ముందే అదృశ్యం అయ్యాడు.

ఈ నాజీ ఆక్రమణకాలంలో, ఫ్యూజిక్ తన కార్యక్రమాన్ని బహిరంగంగా సాగించడానికిగానీ, పత్రికలకు వ్యాసాలు వ్రాయడానికిగానీ బొత్తుగా అవకాశం లేకుండాపోయింది. అయినా ఫ్యూజిక్‌లాంటి విప్లవమూర్తులు తమ బొందిలో ఊపిరి ఉన్నంతవరకు ఊరకే చేతులు ముడుచుకొని కూర్చుంటారా?

కామ్రేడ్ ఫ్యూజిక్ తన దృష్టిని జెక్ సాహిత్యంవైపు మరలించాడు. జెక్ సాహిత్య పరిణామాన్నిగురించీ, దాని ఉత్తమ ప్రజాస్వామిక సాంప్రదాయాలను గురించీ విపులంగా వ్రాయాలని అతని హృదయంలో ఎప్పటినుంచో అభిలాషఉండేది. అది ఈనాటికి కొంతవరకైనా నెరవేరింది. జెకోస్లోవేకియా జాతీయ మహాకవి అయిన జాన్ నెరూడాను గురించిన వ్యాసం వ్రాస్తూఉన్న సమయంలోనే అతనుఉన్న ప్రదేశంపై గెస్టపో దాడి చేయడం జరిగింది. గెస్టపో చేతుల్లో బడ

కుండా జూలియస్ ఫ్యూజిక్ తప్పించుకో గలిగాడు. కాని ఆ వ్యాసాన్నిమాత్రం గెస్టపో అధికారులు అగ్నికి ఆహుతిచేశారు. ఇందులో కొన్ని భాగాలనుమాత్రం ఫ్యూజిక్ అనుచరులు సురక్షితంగా కాపాడగలిగారు.

జూలియస్ ఫ్యూజిక్ తన మరణానికి ముందు పాంక్రాస్ జైల్లోఉన్న సమయంలో ఇలా వ్రాశాడు :-

"మేం నాటిన ఈ అంకురం పెరిగి పెద్దదై త్వరలోనే పుష్పిస్తుంది. ఫలిస్తుంది. నూతన సమాజం ఉదయిస్తుంది. ఈకృషిని పూర్తి చేసే అవకాశం నాకు లేకపోయింది. కాని రానున్న తరంవారు - సోషలిస్టు సమాజంలోని కార్మికులూ, కవులూ, కళావేత్తలూ, సాహిత్య విమర్శకులూ, చరిత్రకారులూ - దీన్ని పూర్తి చేస్తారు. నాకంటె బాగా వ్రాస్తారు."

ఫ్యూజిక్ సాహిత్యంలో కృషిచేశాడంటే పోరాటంనుంచి విరముంచుకున్నాడనికాదు. పోరాటంలో ఒక ప్రధానరంగమైన ప్రజా వైజ్ఞానిక రంగంలో చేసేకృషి నాజీ, వ్యతిరేక పోరాటంలో ఒక భాగమే.

అజ్ఞాతవాసంలోఉంటూ ఫాసిజానికి వ్యతిరేకంగా ఆయన తీవ్రమైన పోరాటం సాగించాడు. 1941 వ సంవత్సరం మొదటిరోజుల్లో జూలియస్ ఫ్యూజిక్ జెకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీలో సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు.

ఫాసిస్టుల క్రూరనిర్బంధచర్యలకు గురికాకుండా జూలియస్ ఫ్యూజిక్, అతని సహచరులూ బహు రహస్యంగా ఒక ప్రెస్సును కూడా నిర్వహించారు. ఆ ప్రెస్సుద్వారా వారు అనేక పత్రికలనూ, కరపత్రాలనూ ప్రకటిస్తూ ఉండేవారు. ఈ సమయంలో ఒక చక్కని నిర్మాతగా, పత్రికా రచయితగా ఫ్యూజిక్ చే ప్రదర్శించబడిన ప్రతిభావిశేషాలు అత్యంత ప్రశంసనీయమైనవి. అజ్ఞాతవాస సమయంలో సైతం ఈ రహస్యపత్రికకు ఒక్క జెకోస్లోవేకియాలోనే కాకుండా, టర్కీ, స్వీడెన్, స్విట్జర్లాండ్, రుమేనియా, చివరకు నాజీ బెర్లిన్ లోకూడా విలేఖరులుండేవారు.

1942 వసంతకాలంలో జూలియస్ ఫ్యూజిక్ పట్టుబడ్డాడు. పట్టుబడినరోజున ఒకరాత్రి, పగలూ 24 గంటలూ - నాజీకిరాతకులు జూలియస్ ఫ్యూజిక్ ను అతిక్రూరంగా, అతి ఘోరంగా హింసించారు. శరీరంఅంతా ఒక పచ్చివ్రణమైపోయింది. స్మృతితప్పిపోయి, శవంలాగా పడిఉన్న ఫ్యూజిక్ ను జైలుగదిలోకి ఈడ్చి అందులో నిర్బంధించారు. కొన్ని రోజులవరకు ఆయనకు మళ్ళీ స్పృహ రానేలేదు. ఫ్యూజిక్ చచ్చిపోయాడని జైలు డాక్టరు పైకి రిపోర్టుకూడా చేశాడు.

తర్వాత ఎప్పటికోస్మృతివచ్చింది. స్పృహ వచ్చిన వెంటనే అతన్ని స్ట్రెచర్ మీద మరో గదిలోకి తీసుకొనివెళ్ళారు. ప్రశ్నలపై ప్రశ్నలు కురిపించారు. కాని మొదటిదెబ్బలకే ఆయన మళ్ళీ స్పృహతప్పి పడిపోయాడు.

ఆరువారాలదాక ఎటువంటి కదలిక మెదలిక లేకుండా అదేవిధంగా శవంలాగా పడిఉన్నాడు. మళ్ళీ క్రమంగా ఆ ఎముకల గూటిలో ప్రాణంచేరుకుంది. వెంటనే పని ప్రారంభించాడు. కొలిన్స్కీ అనే జైలు వార్డరే స్వయంగా ఆయనకు పెన్సిలూ, కాగితమూ అందజేశాడు. చిన్నచిన్న కాగితపు ముక్కలపై ఫ్యూజిక్ వ్రాసిన నోట్సును ఆ వార్డరే అతిరహస్యంగా బైటికి చేరవేస్తూ ఉండేవాడు. ఆవిధంగా తయారయిన పుస్తకమే "రక్తాక్షరాలు."

జారు ప్రభుత్వకాలంలో జైల్లో నిర్బంధించబడిన బోల్షివిక్ యోధుడు ఫెలిక్స్

జెర్జిన్‌స్కీ కారాగృహవాససమయంలో తన దినచర్య పుస్తకంలో వ్రాసుకున్న ఈ క్రింది మాటలు 'రక్తాక్షరాల'కు పరిచయవాక్యాలుగా చక్కగా ఉపయోగిస్తాయి.

"ఈ శవగృహాల్లో - జైళ్ళల్లో - జరిగే అమానుష హింసాచర్యలనుగురించీ, పోరాటాలనుగురించీ, ఉరిశిక్ష విధించబడి ఉరికంబాలను కౌగిలించుకోబోయే ఖైదీల హృదయాల్లో క్రుంగుతూ, పొంగుతూ ఉండే భావపరంపరలగురించీ కారాగృహబద్ధులైన వీరుల హృదయాల్లో, భీరువుల హృదయాల్లో, వధ్యశాలకు కొనిపోబడేవారి హృదయాల్లో ఉబుకుతూఉండే ఆ భావతరంగాలను గురించీ ఎవరైనా చిత్రించేటట్లయితే ఈ శవగృహం యొక్క, ఈ శవగృహంలో ఉండే ఖైదీల యొక్క జీవితం భావి స్వాతంత్ర్య పోరాటాల్లో ఒక మహత్తర ఆయుధంగానూ, జాజ్వల్యమానమైన ఒక విప్లవజ్యోతిగానూ చక్కగా ఉపయోగపడుతుంది. ఈ నిర్బంధితులయొక్క పేరులనూ, శిక్షలనూ ఉరిశిక్ష తేదీలవారీగా ప్రజల కందించిన మాత్రాన ప్రయోజన మేమీలేదు. ఎటువంటి ఘోరాతి ఘోర చిత్రహింసలకుకూడా తొణకని, బెణకని వారి మనోధైర్యం, ఉరికంబాలను కౌగిలించుకోబోతున్న సమయంలోకూడా వారిముఖంలో చిందులాడే చిరునవ్వులూ, భవిష్యత్తులో ప్రజావిజయంలో వారికుండే ఆ అచంచల విశ్వాసమూ, మృత్యుముఖంలో ఉండికూడా శత్రువులపై వారు ప్రదర్శించే ఆ తీవ్రాతితీవ్రమైన ద్వేషమూ, ప్రజల హృదయఫలకాలపై హత్తుకొనేటట్లుగా చిత్రించాలి. ఇలాంటి బాధలకు ఎవరైతే స్వయంగా గురిఅయ్యారో, అనుభవించారో వారే ఈ పనిని జయప్రదంగా నిర్వహించగలరు."

యుద్ధరంగంలో మరణిస్తూన్న సోల్జరు తన రైఫిల్‌ను మరో సోల్జరుచేతి కిచ్చినట్లు, కామ్రేడ్ ఫ్యూజిక్ తాను ఉరికంబాన్ని కౌగిలించుకోబోతూ, స్వాతంత్ర్యపోరాటాన్ని సాగిస్తోన్న ప్రపంచ యోధులకు 'రక్తాక్షరాలు' సమర్పించాడు. జెర్జిన్‌స్కీ మాటల్లో చెప్పాలంటే ఇది "ఒక మహత్తర ఆయుధం. స్వాతంత్ర్య పోరాటాలకు వెలుగు నిచ్చే విప్లవజ్యోతి."

భయం అంటే ఏమిటో ఎరుగని మహాయోధుడు కామ్రేడ్ ఫ్యూజిక్. కాబట్టే ఆయన చేతినుంచి వచ్చిన రక్తాక్షరాల్లో ప్రత్యక్షరంలో నిర్భయత్వం పేరుకుపోయింది.

కష్టాలు బాధల నే విధంగా నష్టించాలో వివరిస్తూ ఒకసారి గోర్కీ ఇలా అన్నాడు:

"బాధలనేవి ప్రపంచానికి అవమానకరమైనవి. బాధలను సమూలంగా నిర్మూలించేందుకే వాటిని పూర్తిగా ద్వేషించాలి." ఉత్తమ భవిష్యత్తుపై అచంచల విశ్వాసం ఉంచి పోరాడే స్వాతంత్ర్యయోధు లందరి హృదయాల్లో - ఇలాంటిభావమే - బాధలపై ఇలాంటి ద్వేషమే - ప్రస్ఫుటమవుతోంది.

తన మరణానికిముందు ఫ్యూజిక్ ఇలా వ్రాశాడు:-

"జీవితాన్ని ప్రేమించినవాణ్ణి. దాని సౌందర్యాన్ని సుస్థిరం చేయడం కోసం ఎంతమహత్తర పోరాటానికైనా సిద్ధపడినవాణ్ణి. మానవులారా! మిమ్మల్ని ప్రేమించాను. మీరు నాపై ప్రేమాదరాలు చూపినప్పుడు సంతోషంతో ఉప్పొంగిపోయ్యాను. మీరు నన్ను అపార్థంచేసుకుంటే

బాధపడ్డాను. మీలాగే - మీలో ఎవరికైనా నేను అపచారం చేసిఉంటే - క్షమించండి! నేనెవరికైనా మేలు చెయ్యగలిగితే మరచిపోండి! ఎవరైనా నా పేరు స్మరిస్తే శోకం రాకుండా ఉండాలని నా ప్రార్థన. ఇది మీ అందరికీ నా అంతిమ వాఙ్మూలం. అమ్మా, నాన్నా, అక్కా, చెల్లీ అందరికీ; ప్రేయసీ అగస్టినా నీకుకూడా. కామ్రేడ్సు! మీ అందరికీ. మీ కన్నీళ్లే శోకపుధూళిని కడిగివేయగలవనుకుంటే ఒక క్షణం దుఃఖించండి. కాని, సంతాపం కూడదు. నా జీవితాన్ని ఆనందంకోసం వినియోగించాను. ఆనందంకోసమే మరణిస్తున్నాను. అటువంటప్పుడు నా సమాధిపై శోకదేవతను ప్రతిష్ఠిస్తే నేను సహించను."

(రక్తాక్షరాలు - పేజీ 25)

రక్తాక్షరాల్లో కామ్రేడ్ ఫ్యూజిక్ అసమాన ప్రతిభాశక్తి స్పష్టంగా గోచరిస్తుంది. భావమూ, వ్యంగ్యమూ, వ్యక్తీకరణా, పాత్రచిత్రణా, హాస్యమూ వగైరా ఇవన్నీ ఫ్యూజిక్ రచనాశైలిలో చక్కగా మేళవించి ఉంటాయి. అతని సునిశితమైన శాస్త్రీయ దృష్టీ, విప్లవాత్మకమైన ఆత్మవిశ్వాసమూ, న్యాయంపై అతనికుండే అనురాగమూ, పట్టుదలా అతని రచనావిధానానికి మెరుగు పెట్టాయి.

ప్రజాద్రోహులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో అతనికలం పదునెక్కింది. పాంక్రాస్ జైల్లో — ఫాసిస్టు మృత్యుముఖంలో — ఉన్నప్పుడుగూడా ఆయనకలం చలించలేదు. జైల్లో ఆయన రచించిన 'రక్తాక్షరాలు' ఒక ఉత్తమకళాఖండం. అది జీవితచరమదశకు సంబంధించిన సంఘటనలను తేదీలవారిగా ఉల్లేఖించే ఒక క్యాటలాగు కాదు. అది ఒకసజీవమైన చిత్రణ. మూర్తీభవించిన వీరరసం. స్వార్థత్యాగానికి ఒక ఉజ్వల ఉదాహరణ.

జర్మన్ ఫాసిస్టుల నెదిరించి జెక్ ప్రజలే విధంగా పోరాడారో హృదయాన్ని ఉర్రూతలూగించేటట్లు ఆ గ్రంథంలో చిత్రించాడు. తన కామ్రేడ్స్ ఎటువంటి అద్భుతకృత్యాలు చేశారో తెలియజేశాడు. మృత్యువు కోరలను సైతం పీకివేసే ఆ ధైర్యసాహసాలనూ, ఆ అమోఘమైన నైతికశక్తికి మూలకారణమేదో వివరించాడు. వాటితోపాటు ఫాసిస్టుల రాక్షసత్వాన్ని కండ్లకుగట్టేటట్లు సాక్షాత్కరింప జేశాడు. ఫాసిస్టువ్యతిరేక పోరాటానికి సంబంధించిన యథార్థగాధనంతా మానవజాతి కందజేయడమే ఆ గ్రంథరచనయొక్క ప్రధానాశయం. ఫాసిజాన్నిగురించి తగు సావధానంగా ఉండవలసిందని ప్రజలందరికి హెచ్చరించడమే ఆయనఉద్దేశం.

వివిధరకాలవ్యక్తుల ప్రభావాన్నిగురించి ఒకచోట కామ్రేడ్ ఫ్యూజిక్ ఇలాఅంటాడు:

"తాము విశ్వసించి కృషిచేసే ఆ దర్శానికి ప్రమాదం వచ్చినప్పుడు నిజాయితీపరులు ప్రతిఘటిస్తారు, ద్రోహులు బైటపడతారు. వీరులు పోరాడుతారు, బలహీనులు దిగజారిపోతారు."

ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో ఎవరిపాత్ర ఏదో కామ్రేడ్ ఫ్యూజిక్

చక్కగా నిరూపించాడు. స్వాతంత్ర్య పోరాటంలో మీరు లెవరో గ్రహించవలసిందిగా కోరాడు. ద్రోహులెవరో గుర్తించి వారికి తగిన బుద్ధిచెప్పడం మరచిపోవద్దని హెచ్చరించాడు.

ఈ పోరాటంలోనుంచి బ్రతికి బైటబడే వారందరినీ తగు సావధానంగా ఉండవలసిందని ఆయన పదేపదే హెచ్చరించాడు. మరో ప్రపంచ యుద్ధంకోసం అభివృద్ధినిరోధకులు అనేక దేశాల్లో తీవ్రంగా విషప్రచారం సాగిస్తోన్నయీరోజుల్లో ఆ భ్యుదయ కాముకులందరికీ ఈ 'రక్తాక్షరాలు' ఒక ఉజ్వలసందేశాన్ని అందజేస్తూఉంది. ఫ్యూజిక్ కూడా మనతోపాటు భుజంభుజంకలిపి పోరాడటానికి వస్తున్నా ఉన్నట్లు ఈగ్రంథం ఒక నూతనోత్సాహాన్ని పురికొల్పుతుంది. ప్రజాపీడకులపై, ప్రజాద్రోహులపై ప్రగాఢమైన ద్వేషాన్ని రగుల్కొలుపుతుంది. లాఠీలతోనూ, తుపాకులతోనూ, గ్రామోస్ పర్వతాల (గ్రీస్) పై బాంబులు వేయడంద్వారాను, మార్షల్ ప్లానుప్రకారం సృష్టించే ఆకలిద్వారాను ప్రజాచైతన్యాన్ని, ప్రజాహృదయాన్ని నాశనం చేయజూచే వారి కలలన్నీ కల్లలవుతాయని తెలియజేస్తుంది.

బెర్లిన్‌లో ఉన్న నాజీకోర్టులో 1943 ఆగస్టు 25వ తేదీన కామ్రేడ్ ఫ్యూజిక్ ఇలా చెప్పాడు:

"ఈ కోర్టులో నాకు ఉరిశిక్ష విధింపబడుతుందని తెలుసు. నా జీవితం సమాప్తం కాబోతున్నది. ఈ పోరాటంలో విజయం సాధించేందుకు నేను చేయగలిగినదంతా చేశాను అనికూడా నాకు తెలుసు. నేను చచ్చిపోతున్నాను; కాని నా తర్వాతకూడా కామ్రేడ్సు ఈ పోరాటాన్ని తుదివరకు తప్పకుండా కొనసాగిస్తారు. అంతిమవిజయం మాదే."

కోర్టులో కామ్రేడ్ ఫ్యూజిక్‌కు ఉరిశిక్ష విధించబడినప్పుడు, అది అసలు తనకు సంబంధించినదికాదు అన్నట్లుగా అతను చాలా ప్రశాంతంగా ఉన్నాడు. కోర్టునుంచి మళ్ళీ ఖైదీలను జైలుకు తీసుకొని వచ్చేటప్పుడు ఖైదీలంతా కలిసి జర్మన్‌భాషలోనూ చెక్‌భాషలోనూ ఎప్పటిలాగే ఉత్సాహంగా 'ఇంటర్నేషనల్' పాడుకుంటూ తిరిగి వచ్చారు.

శిక్షానంతరం రడల్ఫ్ బెడ్రిచ్‌ను ఫ్యూజిక్‌ను జైల్లో ఒకే సెల్లులో ఉంచారు. ఫ్యూజిక్‌ను గురించి తర్వాత బెడ్రిచ్ ఇలా అన్నాడు:

"నాకు ఉరిశిక్ష విధింపబడి 170 రోజులు గడచిన తర్వాత ఈరోజున ఫ్యూజిక్‌ను కూడా నాగదిలోనే ఉంచారు. ఇప్పటికే నాలో చలనం స్తంభించిపోయింది. దేన్ని గురించీ—చివరకు నా కుటుంబాన్నిగురించి కూడా ఆలోచించలేకుండా ఉన్నాను. కాని ఫ్యూజిక్ తానేదో చిరకాలం జీవించబోతున్నట్లు ఎప్పుడూ ఏదోఒకటి పాడుతూనే ఉండేవాడు. ఏదో ఒక కథ చెప్పుతూనే ఉండేవాడు."

ఆగస్టు 4వ తేదీన బాంబుపడిన ఫలితంగా జైలుబిల్డింగ్ బ్రద్దలయిపోయింది. ఖైదీలందరిని ఒక మందలాగా తోలుకొనివెళ్ళి దొడ్డిలో ఉంచారు. గుండెలు జారిపోయిన కొందరు చెక్ కామ్రేడ్సును చూచాడు. కామ్రేడ్ ఫ్యూజిక్ వారిని సంబోధించి నిప్పులు కురిపిస్తూ గంభీరోపన్యాసం ఇచ్చాడు. అదే ఆయన అంతిమ ఉపన్యాసం. సోవియట్ ప్రజల నైతికశక్తినిగురించీ, మాస్కో, స్టాలిన్

గ్రాడ్ నగరాల రక్షణకోసం సోవియట్ ప్రజలు చూపిన అద్భుత ధైర్యసాహసాలను గురించీ, స్వార్థత్యాగాన్నిగురించీ ఆ ఉపవ్యాసంలో చక్కగా వివరించాడు.

ఇంకా అతను ఇలా అన్నాడు: "పశ్చిమంగా రెండోరంగం ప్రారంభించినట్లయితే యుద్ధం చాలా త్వరలోనే సమాప్తం అవుతుంది. అప్పుడు మనలో కొందరైనా బ్రతికి బైటబడే అవకాశం ఉంది. ఏమైనా మనం యోధులం, స్వాతంత్ర్యయోధులం. మనం మరణించినా, మన పవిత్ర ఆశయాలకు కట్టుబడి గౌరవప్రదంగా మరణించినవార మవుతాం."

సోవియట్ యూనియన్ యొక్క అజేయమైన శక్తిని ఫ్యూజిక్ గుర్తించాడు. ప్రజల శక్తిపై అచంచల విశ్వాసం ఉంచాడు. మృత్యుదేవతకూడా ఆ విశ్వాసాన్ని కదిలించలేకపోయింది.

1948 - హేమంతంలో - కామ్రేడ్ ఫ్యూజిక్ 5వ వర్ధంతి సందర్భంలో ఆయన వ్రాసిన "మనం ఎందువల్ల మన ప్రజలను ప్రేమిస్తున్నాం" అనే వ్యాస సంపుటి ప్రచురించబడింది. అందులో ఒకచోట ఫ్యూజిక్ ఇలా వ్రాశాడు :-

"మనం - కమ్యూనిస్టులం - నిజమైన సుఖప్రదమైన స్వతంత్ర జీవితాన్ని అభిలషిస్తున్నాం. అలాంటి జీవితంకోసమే మనం పోరాడుతున్నాం. కాబట్టే మనం జీవితాన్ని ప్రేమిస్తున్నాం. ఆ జీవితంకోసమే మనం మన ప్రాణాలను ధారపోస్తున్నాం. బానిస సంకెళ్లలో బంధించబడి ఒక పూటకుకూడా చాలీచాలని తిండితో అరచేతిలో ప్రాణాలు బిగబెట్టుకొని బ్రతికే ఈ జీవితం అసలు జీవితమే కాదు. ఇలాంటి జీవితాన్ని గడపడం మానవజాతికే అవమానకరం.

మనం - కమ్యూనిస్టులం. మానవుని ప్రేమిస్తున్నాం. విశాలభూమండలంపై మానవుడు సుఖంగా, శాంతియుతంగా, ఆనందంగా మానవజాతికి తగినట్లుగా జీవించేందుకు మన స్వార్థాన్ని నిస్సంకోచంగా, నిస్సందేహంగా త్యాగం చేస్తున్నాం.

"మనం - కమ్యూనిస్టులం - స్వాతంత్ర్యాన్ని ప్రేమిస్తున్నాం. కాబట్టే మనం మనపార్టీయొక్క ఉక్కు శిక్షణకు కట్టుబడి ఉంటున్నాం. మన సభ్యులు కామ్రేడ్ లెనిన్ సైనికులు. సమస్త మానవజాతికీ మనం విజయాన్ని సాధించగలం.

"మనం - కమ్యూనిస్టులం - సృజనాత్మకకృషిని (క్రియేటివ్ వర్క్) ప్రేమిస్తున్నాం. అదే మానవజాతికి ఉజ్వలభవిష్యత్తు. కాబట్టే మానవుని సృజనాత్మకశక్తి వికసించనీయని ప్రతిబంధకాలను - ప్రతి బంధకాలను

మాత్రమే – నిస్సంకోచంగా నాశనం చేస్తాం.

"మనం – కమ్యూనిస్టులం – శాంతి నభిలషిస్తున్నాం. కాబట్టే పోరాడుతున్నాం. యుద్ధాలకు కారణభూతమైన ఈ దోపిడీవిధానాన్ని నిర్మూలించేందుకు పోరాడుతున్నాం. లక్షలకొలది ప్రజలను ఒక్క కలంపోటుతో మృత్యుగహ్వరంలోకి పంపించే యుద్ధోన్మాదుల ఆటల నరికట్టడానికి పోరాడుతున్నాం."

సామ్రాజ్యవాద వ్యతిరేకశిబిరంలో ఉన్న అభ్యుదయకాముకులైన ప్రజలందరికీ కామ్రేడ్ ఫ్యూజిక్ రచనలు అమూల్యములైన పెన్నిధులు. అభివృద్ధినిరోధకులకు వ్యతిరేకంగా పోరాటంసాగించే అభ్యుదయ రచయితలూ, కళావేత్తలూ, విజ్ఞానవేత్తల చేతుల్లో 'ప్రజలారా! సావధానంగా ఉండండి!' అని కామ్రేడ్ ఫ్యూజిక్ చేసిన హెచ్చరిక ఒక మహాస్త్రం లాంటిది.

[1949 జనవరి సోవియట్ లిటరేచరులో గ్రొమోవ్, నికోలయేవాలు వ్రాసిన వ్యాసానికి అనువాదం]

"పిరికివాడు తన ప్రాణమే కాదు. ఇతరుల జీవితాన్ని కూడా బలి తీసుకుంటాడు."

—జూలియస్ ఫ్యూజిక్

# పసిఫిక్ సంధి
# ఆసియా ప్రజాఉద్యమాలపై
# ఆంగ్లో - అమెరికన్ కుట్ర

ఇండోనేషియాపై ఢిల్లీలో జరిగిన సమావేశం, ఆ తరువాత బర్మానుగురించి జరిగిన "సంప్రతింపుల" సమావేశం — ఇక ముందు లండన్‌లో జరుగబోతున్న కామన్‌వెల్తు ప్రధానుల సమావేశం — దీనికి ప్రాతిపదికగా ప్రస్తుతం బ్రిటిష్ మంత్రులు అట్లాంటిక్ ఒడంబడికకు ఒక శాఖగా పసిఫిక్ ఒడంబడికకోసం ఇండియాతోసహా దూరప్రాచ్య దేశాలతో జరుపుతున్న మంతనాలూ — ఇవన్నీ నెహ్రూప్రభుత్వం అనుసరిస్తున్న విదేశాంగ విధాన వైఖరి అసలురంగును పూర్తిగా బట్టబయలు చేశాయి.

పైన ఉదహరించిన సంఘటనలన్నీ గొప్పగా చెప్పబడుతున్న నెహ్రూ "తటస్థ", "స్వతంత్ర" విదేశాంగవిధానమూ, నెహ్రూగారి "ఆసియాఖండ నాయకత్వమూ"— యివన్నీ ఇండియాను క్రమక్రమేణా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాద దురాక్రమణదారుల కూటమిలోకి, యుద్ధంలోకి దింపడానికి ఒకముసుగు తప్ప మరొకటికాదు.

టాటా, బిర్లా వర్గ ప్రయోజనాలను, అత్యంత జాగరూకతతో రక్షించే యీ ప్రభుత్వం మన దేశాన్ని, మన శ్రామిక ప్రజాకోటినీ ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు అమ్మివేయడానికి ప్రయత్నించుచున్నదని పైన వివరించిన సంఘటనలన్నీ స్పష్టం చేస్తున్నాయి. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆగ్నేయాసియాలోని స్వాతంత్రోద్యమాలను నాశనం చేసి,

అక్కడ కూలిపోతున్న తమ వలస పరిపాలనను భద్రపరచుకొనేందుకూ, సోషలిస్టు సోవియట్ యూనియన్‌పై దురాక్రమణ యుద్ధాన్ని కొనసాగించేందుకూ అనుకూలంగా ఇండియాను అధిక మిలిటరీ కేంద్రంగా మార్చేందుకు నెహ్రూ ప్రభుత్వం సంసిద్ధపడుతున్నట్లు వరుసగా జరుగుతున్న యీ సంఘటనలన్నీ రుజువు చేస్తున్నాయి.

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికపై సంతకాలు జరగడం, ప్రపంచాన్నంతటినీ ఆవరించే అల్లాంటిరకమైన మరికొన్ని ఒడంబడికలనే "వాల్‌స్ట్రీట్*" సర్వాధిపత్యాన చేసుకోవడానికి ప్రయత్నాలు జరగడం - తత్ఫలితంగా ప్రతిదేశాన్నీ, ప్రతిమనిషినీ ఒకనిశితమైన ప్రశ్న ఎదుర్కొంటోంది: ప్రపంచశాంతియా లేక మరొక ప్రపంచయుద్ధమా?, స్వాతంత్ర్యం, సోషలిజమా లేక వలసదేశ బానిసవిధానమా, పెట్టుబడిదారీ పీడనా?

సోషలిస్టు సోవియట్ యూనియన్ నాయకత్వాన ప్రపంచమంతటా బ్రహ్మాండంగా పురోగమించుతున్న విప్లవశక్తులనూ, పతనమవుతున్న పెట్టుబడిదారీ విధానాన్ని ఆవరించిన తీవ్ర ఆర్థిక సంక్షోభాన్ని చూసి కంగారుపడి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు తెగించి మరొక ప్రపంచయుద్ధానికి, సోషలిస్టు రాజ్యంపై యుద్ధానికి దిగుతున్నారు. సరిగ్గా యిదే విధానాన్ని అనుసరించి హిట్లర్ తన సర్వనాశనాన్ని కొనితెచ్చుకొన్నాడు.

సోషలిస్టు రాజ్యంపైకి దురాక్రమణ యుద్ధానికి పూనుకొన్న ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు అండగా, ప్రతిదేశంలోని ధనికవర్గాలూ సమీకరించబడుతున్నాయి. వివిధ దేశాలలోని పెట్టుబడిదారీ వర్గాలు తమ దేశం వాల్‌స్ట్రీట్ మిలిటరీ కేంద్రంగా వినియోగించడానికి ఒడంబడి తమ దేశాన్నీ, తమ ప్రజలనూ సామ్రాజ్యవాదుల దురాక్రమణ యుద్ధంలో బలి చేయడానికి సిద్ధపడుతున్నారు. ఈవిధంగా ప్రతిదేశంలోని పెట్టుబడిదారీ వర్గాలు ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల పంచమాంగ దళంగా తయారవుతున్నాయి.

ఉధృతంగా పురోగమించుతున్న సోషలిజాన్ని ఆపి పతనమవుతున్న తన విధానాన్ని కాపాడుకొనేందుకు, ప్రపంచ పెట్టుబడిదారీవర్గం అమెరికా నాయకత్వాన విప్లవ ప్రతీఘాత సంఘటనను నిర్మించడానికి తంటాలు పడిచేసిన తుది ప్రయత్నమిది.

* వాల్‌స్ట్రీట్: అమెరికా కోటీశ్వరులకు పర్యాయపదం. —అనువాదకుడు.

ప్రపంచ మంతటా "ప్రాంతీయరక్షణ", "ప్రజాస్వామిక రక్షణ" అనే మోసపు పేర్లతో అట్లాంటిక్ ఒడంబడికనీ, పసిఫిక్ ఒడంబడికనీ, మెడిటరేనియన్ ఒడంబడికనీ, ప్రపంచమంతా ఆవరించడానికి అమెరికా సామ్రాజ్యవాదులు చేస్తున్న ప్రయత్నాల కిదే అంతరార్థం.

## II

నూతనపరిస్థితీ, అందుకనుకూలంగా యుద్ధానికిగానీ శాంతికిగానీ ప్రపంచమంతటా బహిరంగంగా ఏవర్గానికావర్గం సమీకరించబడటం మూలంగా నెహ్రూగారి "స్వతంత్ర" విదేశాంగవిధానంయొక్క నిజమైన వర్గవైఖరి స్పష్టంగా బట్టబయలు అయిపోయింది.

అట్లాంటిక్ ఒడంబడిక పాత్రాన్నిగురించి ఇండియా, పాకిస్తాన్‌లను "పూర్తిగా సంప్రతించారనీ", బ్రిటన్ అట్లాంటిక్ ఒడంబడికలో చేరడానికి వారు "హృదయపూర్వకంగా తమ అంగీకారాన్ని" తెలిపారనీ బ్రిటిష్ విదేశాంగ కార్యాలయు వర్గాలనుండి తెలుస్తున్నదని మార్చి 20 వ తేదీన లండన్‌నుండి వెలువడిన యు. పి. ఐ. వార్త తెలియజేస్తోంది. ఆవార్తలోనే యింకా యిలావుంది.

"పశ్చిమరాజ్యాల రక్షణవ్యూహం యెడల ఇండియా పాకిస్తాన్‌లు కొంతవరకు అనుకూల వైఖరిని కలిగివున్నాయనే సిద్ధాంతాన్ని ఇక్కడున్న బాధ్యతగల భారతీయవర్గాలవారు అంగీకరించడానికి సిద్ధపడుతున్నారు... ఢిల్లీలోనూ, కరాచీలోనూ గార్డన్-వాకర్స్ జరుపుతున్న సంప్రతింపులు పండితనెహ్రూనూ, లియాఖతాలీఖానును కామన్‌వెల్తు ప్రధాన మంత్రుల సమావేశానికి హాజరయ్యేటట్లు చేయగలిగితే—బహిరంగంగా వారు తమ అసమ్మతిని ఎంత తెలయజేసినప్పటికీ—మరొక ప్రపంచయుద్ధం సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధం తటస్థించినపక్షంలో ఇండియా పాకిస్తాన్‌లు ఆ యుద్ధానికి తమ అనుకూల వైఖరిని కలిగి ఉంటాయి."

అట్లాంటిక్ ఒడంబడికతో ఇండియాకు ప్రధానంగానూ, ప్రత్యక్షంగానూ ఎలాంటి సంబంధమూ లేదని ఇండియా ప్రభుత్వానికి సంబంధించిన ఒక వ్యాఖ్యాత తెలిపినట్లు మార్చి 20 వ తేదీన ఢిల్లీనుండి వెలువడిన యు. పి. ఐ. వార్త ఉదహరించుతోంది. ఈ ప్రభుత్వవ్యాఖ్యాత ఎంత జాగ్రత్తగా మాటలను ఏరుకొని మరీ వాడినా ప్రభుత్వ విదేశాంగ విధానంయొక్క నిజవైఖరిని యింకెంత మాత్రమూ దాచలేరు.

బ్రిటిష్, ఆస్ట్రేలియా, ఇండియా ప్రభుత్వాలమధ్య సామ్రాజ్య రక్షణ వ్యూహాన్ని గురించి ప్రస్తుతం జరుగుతున్న సంప్రతింపులు (కామన్ వెల్తు ప్రధానుల సమావేశానికి ప్రాతిపదికగా) అట్లాంటిక్ ఒడంబడికకు అనుబంధంగా ఏదోవిధమైన పసిఫిక్ ఒడంబడికను కుదుర్చుకొని చిట్టచివరకు ఆంగ్లో అమెరికన్ యుద్ధకూటమిలోకి బహిరంగంగా ఇండియాను చేర్చే విషయాన్ని గురించే జరుగుతున్నాయి. ఈ యథార్థాన్ని ఇంకెంతకాలమూ దాచడానికి వీలులేని విషయం.



నిజానికి గత అక్టోబరు మాసంలో లండన్‌లో జరిగిన కామన్‌వెల్తు ప్రధానుల సమావేశం జరిగినప్పటినుండి సాగుతున్న కుట్రల పర్యవసానమే యీనాడు జరుగుతున్నది.

ఆ సమావేశం తన తుది ప్రకటనలో అట్లాంటిక్ ఒడంబడికకు పునాదీ, ప్రాతిపదికయైన పశ్చిమరాజ్యాల యూనియన్ నిర్మాణానికి బహిరంగంగా తన ఆమోదాన్ని తెలిపింది. ఈవిధంగా ఇండియాతోసహా కామన్‌వెల్తు దేశాలన్నింటినీ రాబోయే అట్లాంటిక్ ఒడంబడికకు అనుకూలంగా వుండేటట్లు చేయడానికి తగిన పరిస్థితులను తయారుచేసింది.

ఆ సమావేశంలోనే పండిత నెహ్రూ మాంటుబాటన్ల సాయంతో ఇండియాను నామకా రిపబ్లిక్‌గా ఉంచేందుకు ఏదోఒక "సూత్రాన్ని" తయారుచేసేటట్లు చేసింది. ఈవిధంగా దేశంలోవున్న ప్రజలను మోసం చేయడానికి ప్రయత్నించారు. మరొకవైపున ఇండియాను కామన్‌వెల్తుతోనే కట్టుబడి ఉండేటట్లుచేసి, చివరకు ఆవిధంగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల కూటమిలో వుంచేటట్లు భారత బూర్జువావర్గం సర్వసన్నాహాలూ చేసింది.

వలసదేశాలను దోపిడీచేసే దొంగలగుంపు అయిన, పశ్చిమ రాజ్యాలయూనియన్ తన ఆశీస్సులను తెలిపి భారత బూర్జువావర్గం 'కమ్యూనిస్టు వ్యతిరేకత' అనే పేరుతో ఆగ్నేయాసియాలో ప్రజ్వరిల్లుతున్న జాతీయవిముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదుల బంటుగా వ్యవహరించే నీచపాత్రను స్వీకరించడానికి సిద్ధపడింది. మలయా, వియత్‌నామ్, ఇండోనీషియాలలో సాగుతున్న హింసాకాండను జరుపుతున్న ఖూనీకోర్లను భారత పెట్టుబడిదారీ వర్గం బలపరచడానికి కారణం ఏమిటి? ఇద్దరికీ ఉన్న సమానమైన వర్గప్రయోజనాలు; సామ్రాజ్యవాదులనుండి మార్కెట్ల రూపంలోనూ, పారిశ్రామిక యంత్రాలరూపంలోనూ భారత ధనికవర్గాలు ఆశిస్తున్న ఎంగిలిమెతుకులూనూ.

కామన్‌వెల్తు ప్రధానుల సమావేశంలో జరిగిన దానిని మార్పుచేయడానికి ప్రధాని నెహ్రూ ఆ తరువాత చాల ప్రయత్నించాడు. "తటస్థత" అనీ, "స్వతంత్రం" అనే తన మామూలు పల్లవిని పునశ్చరణ చేయడానికి నెహ్రూ తన శక్తికొలదీ ప్రయత్నించాడు. కాని బ్రిటిష్ మంత్రులైన అలెగ్జాండర్ ప్రభృతులవల్ల అసలు రహస్యం బయటపడిపోయింది.

బ్రిటిష్ రక్షణశాఖామంత్రి అలెగ్జాండర్ యిటీవల కామన్సుసభలో ప్రసంగిస్తూ లండన్‌లో జరిగిన కామన్‌వెల్తు ప్రధానుల సమావేశం వివిధ కామన్‌వెల్తు రాజ్యాలమధ్య రక్షణ వ్యవహారాలను గురించి సంప్రతించుకొనేందుకు చక్కని అవకాశం కలిగించినదని ప్రకటించాడు.

ఆ సమావేశం కాగానే క్రిప్సు పార్లమెంటులో మాట్లాడుతూ ఇండియాతోసహా కామన్ వెల్తు దేశాలన్నీ బ్రిటన్ యొక్క ఆర్థిక మరియితర ప్లానులతో సంపూర్తిగా సహకరించుతామని వాగ్దానం చేశాయని తెలిపాడు.

లండన్ సమావేశం జరిగినప్పటినుండీ (యిక్కడే ఇండియాతోసహా కామన్ వెల్తు దేశాలన్నింటినీ పశ్చిమ యూనియన్ తో సహకరించేటట్లు ఒడంబడిక జరిగింది.) సామ్రాజ్యవాద ప్రభుత్వాలు అట్లాంటిక్ ఒడంబడికకోసం త్వరిత్వరగా అన్ని సన్నాహాలూ చేయడం జరిగింది. అప్పటినుండి అమెరికా అగ్రనాయకత్వ పాత్రను తీసుకొన్నది.

సరిగ్గా అదేసమయంలో అదేవిధంగా ప్రాచ్యదేశాలలో సన్నాహాలు ప్రారంభమయ్యాయి. ఆగ్నేయాసియా దేశాలన్నింటిలోనూ వున్న బూర్జువావర్గ ఉపగ్రహాల సాయంతో ఆగ్నేయాసియా దేశాలలో ఉవ్వెత్తుగా విజృంభిస్తున్న ప్రజా విప్లవాలను రక్తపుటేరులలో ముంచడానికి విప్లవ ప్రతీఘాత సంఘటనను నిర్మించడానికి అన్ని ప్రయత్నాలు జరిగాయి. ఈ ప్రయత్నాలన్నీ అట్లాంటిక్ ఒడంబడికకు అనుబంధంమాత్రమే.

## IV

జనవరి మాసంలో ప్రధాని నెహ్రూ పిలుపుపై "ఇండోనీషియాసమస్యపై ఆసియా రాజ్యాల సమావేశం" ఢిల్లీలో జరిగింది. ఈ సమావేశం చాల పటాటోపంతో జరిగింది. "ఆసియాకు నెహ్రూనాయకత్వం", "సామ్రాజ్యవాద దేశాలకు ఆసియాసవాలు", "ఇండోనీషియాకు స్వాతంత్ర్యం" - వీటన్నింటిని గురించి గొప్పగా బాకాలూదడం జరిగింది. సామ్రాజ్యవాదంపైన నెహ్రూ నిప్పులు కక్కాడు. డచ్చి సామ్రాజ్యవాదులను ఖండించుతూ పెద్దపెద్ద ఉపన్యాసాలు జరిగాయి.

అయితే యీ సమావేశఫలితంగా జరిగిన అసలు పర్యావసానమేమిటి? ఆ సమావేశంలో చేసిన తీర్మానాలు నిజానికి ఎక్కడకు దారితీస్తున్నాయి?

### ఇండోనీషియాకు ద్రోహం

ఢిల్లీలో నెహ్రూఆధ్వర్యాన జరిగిన యీ సమావేశం ఇండోనీషియా అంతటా గెరిల్లా పోరాటం అగ్నిజ్వాలల్లాగా ప్రజ్వరిల్లుతూ డచ్చిసామ్రాజ్యవాదులు రాజకీయంగానూ, మిలిటరీరీత్యానూ అపజయాన్ని పొందుతున్న పరిస్థితులలో జరిగింది. ఆ సమయంలోనే అమెరికా నాయకత్వాన నాలుగు రాజ్యాల తీర్మానం, భద్రతాసంఘంలో చర్చించబడుతోంది. ఈ తీర్మానం ఇండోనీషియా ప్రతిఘటనా శక్తులను చీలదీసి, కరుడుగట్టిన హట్టా మితవాద నాయకత్వాన్ని ఏవోకొన్ని నామమాత్రమైన సదుపాయాలు చూపెట్టి కొనివేయడానికి ఉద్దేశించబడింది. ఆవిధంగా వారు జాతీయ మితవాద బూర్జువాతో కలసి సంయుక్తంగా ఇండోనీషియా గెరిల్లా ఉద్యమాన్ని పూర్తిగా అణచివేయదలచారు. ఈ పరిస్థితులలో ఇండోనీషియా సమస్యపై ఢిల్లీలో సమావేశం జరిగింది.

ఈ సమావేశాన్ని ఇండోనీషియాను విప్లవాన్నుండి కాపాడటానికి జరిపారు. ఇండోనీషియా స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా జరుగుతున్న యీ భయంకరకుట్రను ఆనాడే సోవియట్ యూనియన్ పూర్తిగా బట్టబయలు చేసింది. ఇండోనీషియానుండి ఎలాంటి షరతులు లేకుండా డచ్ దురాక్రమణ సైన్యాలు

వైదొలగాలని డిమాండ్ చేసింది. ఇండోనీషియాలో ప్రజల సర్వస్వాతంత్ర్యాన్ని పునస్థాపితం చేయాలని కోరింది.

అయితే నెహ్రూగారి "ఆసియారాజ్యాల సమావేశం"— యీ సమస్యపై ఆచరణలో ఎలాంటివైఖరిని తీసుకొన్నది?

**డచ్చి దురాక్రమణకు నిజంగా వెనుకనిలబడి ప్రోత్సాహమిచ్చిన అమెరికా సామ్రాజ్యవాదులను యీ సమావేశంలో ఒక్క పల్లెత్తు మాటకూడా అనలేదు! ఇండోనీషియా స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా భద్రతా సమితిలో జరుగుతున్న కుటను ఖండించుతూ ఒక్క మాటకూడా లేదు! మార్షల్ ప్లానుద్వారా డచ్చి దురాక్రమణ దారులకు ఆర్థికసహాయం చేస్తున్న డాలర్ సామ్రాజ్యవాదులను నిరసించుతూ మాటలేదు!!! అసలు అమెరికా ఆర్థికసహాయంలేని పక్షంలో ఇండోనీషియాలో ఒక్క డచ్చి సైనికుడు కూడా పోరాడేస్థితిలో ఉండనేవుండడు.**

ఈ మహాసభలో చేయబడిన ప్రధాన తీర్మానం ఆశయానికి పూర్తిగా వ్యతిరేకంగా కూడా వుంది. ఈతీర్మానం ప్రతి ముఖ్య సమస్యపైనా అమెరికా తీసుకొన్న వైఖరికి "డిటో" అన్నది. డచ్చి దురాక్రమణదారులు ఏలాంటి షరతులు లేకుండా వైదొలగాలన్న విషయంపైనా, ఇండోనీషియాలో ప్రజల సర్వస్వాతంత్ర్యాన్ని పునస్థాపితం చేయాలన్న ప్రతిపాదనపైనా, ఇండోనీషియా ప్రజల సాయుధ పోరాటానికి సాయపడాలన్న విషయంపైనా యీ సమావేశంలో ఆమోదించబడిన తీర్మానం నోరు మెదపకుండా మౌనం వహించింది.

పైగా యీ సమావేశం తాను పెట్టిన ప్రతిపాదనలను ఆచరణలో పెట్టేందుకు అమెరికా అధిపత్యాన ఉన్న "గుడ్ ఆఫీసెస్ కమిటీ" చేతులలో ఉంచింది. అంటే ఇండోనీషియాను తిరిగి వలసదేశంగా మార్చాలన్న యుద్ధానికి మూల ప్రేరేపకులైన అమెరికన్ల చేతులలోనే పెట్టిందన్నమాట.

ఈ సమావేశంలో మొట్టమొదటినుండి చివరవరకూ చూసినా సోవియట్ చేసిన ప్రతిపాదనలపై తమ అభిప్రాయాలను వెలిబుచ్చకుండా ఉద్దేశపూర్వకంగా మౌనంవహించి తమ ద్రోహాన్ని కప్పిపుచ్చుకొన్నారు.

ఈ "ఆసియాసభకు అన్నిరకాల ఫ్యూడల్ బూర్జువా పరిపాలకవర్గాల ప్రతినిధులనూ, అమెరికా కీలుబొమ్మ ప్రభుత్వాలు ఇరాక్ నుండి సౌదీ అరేబియా వరకూ మరొక ప్రక్క పిలిపిస్తున్నూ ఈ వైపునుండి ఆస్ట్రేలియానూ (ఇది బ్రిటన్‌తోబాటు సిగ్గులేకుండా భద్రత సమితిలో డచ్చిదురాక్రమణ విధానాన్ని బలపరచింది), కూలిపోతున్న చెంగ్ కేషేక్ ప్రభుత్వప్రతినిధినీ ఆహ్వానించారు. కాని ఆదేసమయంలో నెహ్రూపండితుని "ఆసియా సభ"లో ఆసియాఖండంలో సామ్రాజ్యవాదుల శాసనత్వాన్ని ప్రతిఘటించే వీరోచిత 'వియత్నాం'కు, గాని ఆసియా సోవియట్ రిపబ్లిక్‌లకు గానీ స్థానంలేకపోయింది. ఈ విధంగా అభివృద్ధి నిరోధకులకు ఆహ్వానాలుపంపి ప్రజాస్వామిక శక్తులను ఆహ్వానించకపోవడం ఏదో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన కాదు.

## అమెరికా సామ్రాజ్యవాదులకు మద్దతు

ఇటు డచ్చి సామ్రాజ్యవాదులపై కొంతవరకు వొత్తిడి తెచ్చి, అటు అమెరికాకు అనుకూలంగానడిచే మాష్ట్రా మంత్రి వర్గాన్ని రాజీధోరణికీడంపే అమెరికా 'సామ్రాజ్యవాదుల అభీష్టాన్ని నెరవేర్చడమే నిజానికి యీ మహాసభయొక్క ఏకైక ఆశయం.

భారత బూర్జువాజీయొక్క నిజమైన ప్లాను యిదేవనే విషయం బిర్లాపత్రిక ఖచ్చితంగా స్పష్టం చేసింది. 1948 అక్టోబరులో "ఈస్టరన్ ఏకానమిస్టు" అనే బిర్లా పత్రిక యిలా వ్రాసింది:

"గత రెండు సంవత్సరాలూ ఇండోనీషియా నాయకులు డచ్చివారితో ఎడతెగని పోరాటంలో కాలంగడిపారు. అయితే యీ పోరాటంయొక్క మంచిచెడ్డలనుగురించి యిక్కడ తర్కించడం అప్రస్తుతం (?). విశాలదృష్టితో పరికించితే ప్రతి ముఖ్యసమస్యపైనా వారే విజయాన్ని సాధించారు.........కాని డచ్చివారితో పోరాడటమే ప్రధానంగా పెట్టుకొని అసలు పెద్దశత్రువును మరచిపోయినట్లు గత కొద్దిరోజులనుండి జరుగుతున్న సంఘటనలు ఇండోనీషియా నాయకులకు తెలియచెప్పి ఉండవలసింది.

[ఎవరూ యీ పెద్ద శత్రువు? ఇండోనీషియాలో ప్రజల విప్లవోద్యమం అని దాని ఉద్దేశం. —సంపాదకుడు]

పైకి వాడబడుతున్న సామ్రాజ్యవాద వ్యతిరేక పదాడంబరం వెనక భారత బూర్జువా వర్గంయొక్క యీ విప్లవప్రతీఘాత ప్లాను యిమిడిఉంది. ఈప్లాను ఇండియాను అమెరికా కూటమికి అనుకూలం చేస్తుంది. భారత ధనికవర్గాలు నేడు పురోగమించుతున్న విప్లవశక్తులకు కంగారుపడుతున్నాయి. ఇండోనీషియా ఆర్థికవిధానంపై నేడు అమెరికా గుత్తపెట్టుబడిదారుల అత్యధిక ప్రాబల్యం ఉంది. అందువలన అమెరికావారికి బాసటగా నిలబడి అమెరికానుండి భిక్షంగా తమకు కూడా కొన్ని మార్కెట్లను సంపాదించుకోవాలనే ఉబలాటంతో, భారత పెట్టుబడిదారీ వర్గాలు యీ నీచపు కార్యక్రమాన్ననుసరిస్తున్నాయి.

## ఢిల్లీసమావేశం అమెరికా నాటకమే!

నెహ్రూ ఎంతపెద్దగా చెప్పుకొన్నా, యీ ఢిల్లీ ప్రదర్శనం నిజానికి అమెరికా సామ్రాజ్యవాదులు ఆడించిన నాటకమే. ఫ్రీప్రెస్ ఆఫ్ ఇండియా యీ నగ్న సత్యాన్ని న్యూయార్కునుండి ప్రకటించింది:

"న్యూయార్కుటైమ్సు లండన్ విలేఖరి కథనంప్రకారం ఇండియాలోని అమెరికా రాయబారి లాయిహెండర్సన్ ఢిల్లీలో జరుగుతున్న ఆసియామహాసభలో ప్రముఖపాత్రను నిర్వహించుతున్నాడు."

ఈ ఢిల్లీ మహాసభను అడ్డంపెట్టుకొని అనేక రహస్యసంప్రతింపులూ, రాయబారాలూ జరిగాయి. వాటి ఫలితాలివి: మధ్యప్రాచ్యంలోవున్న దేశాలన్నీ పాలస్తీనా సమస్యపై సామ్రాజ్యవాదుల పరిష్కారమార్గాన్ని

వొప్పించేందుకు యూదుల ఇస్రాఇల్ రాజ్యంపై "కలసి వొత్తిడి" తీసుకొనిరావడం, ఇండియా పాకిస్తాన్ సైన్యాలు కాష్మీర్‌లోనే వుండిపోవడం, అమెరికావారి ఆధిపత్యాన (మిత్రరాజ్యసమితి కమీషన్) రెండువైపులా రక్షణ శ్రేణులను నిర్మించడం, కాష్మీర్‌ను సోవియట్ వ్యతిరేక కేంద్రంగా తయారుచేయడం, "అరుణ చైనా" నుండి వస్తున్న "కమ్యూనిస్టు ప్రమాదాన్ని" తప్పించడానికి ఆసియా దేశాలు మిలిటరీ ఒడంబడికను చేసుకోవడం.

ఢిల్లీ మహాసభ ఒకవేపున జరుగుతూ వుండగానే మహాసభకు హాజరవుతున్న బర్మా ప్రధాని థాకిన్-నూ బ్రిటన్‌తో తన ప్రభుత్వానికున్న మిత్రత్వాన్ని, బ్రిటన్‌తోపాటు బర్మాను "రక్షించు"కొనేందుకు తన ప్రభుత్వం బ్రిటన్‌నుండి కొన్ని ఆయుధాలను సేకరించడాన్ని గురించీ మొదలుగాగల విషయాల నన్నింటినీ సమర్ధించుకొనే ఉద్దేశ్యంతో భారతీయ పత్రికలలో వరుసగా వ్యాసాలు రాశాడు.

ఢిల్లీ మహాసభ జరుగుతున్నప్పుడు యిలాంటి వ్యాసాలను వ్రాయడంలోని రాజకీయ అంతరార్థం స్పష్టంగా విదితమవుతోంది. ఢిల్లీ మహాసభ వివిధ దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలకూ, సమీప, మధ్య, దూరప్రాచ్యదేశాలలోని జాతీయ విముక్తి ఉద్యమాలనూ ఒకసర్ణీత పద్ధతిలో ఎదుర్కొనేందుకు కావలసిన ప్రాతిపదిక నంతటినీ తయారుచేసింది. అప్పుడే "కమ్యూనిజానికి వ్యతిరేకంగా రక్షణకోసం" అన్న పేరుతో సామ్రాజ్యవాదుల నాయకత్వాన ఒకఅభివృద్ధి నిరోధక కూటమిని ఏర్పరచడానికి కూడా ప్రయత్నాలు జరిగాయి.

నెహ్రూగారి "ఇండోనీషియాసమస్యపై ఢిల్లీసభ" యొక్క నిజమైన అవసరం యిదే. నెహ్రూగారి "ఆసియాఖండ నాయకత్వం" అన్నదానికి అంతరార్ధంకూడా అదే. "తటస్థత" అనీ, "స్వతంత్రత" అని మాట్లాడే పెద్దపెద్ద మాటలన్నీ ఇండియాను ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల కూటమికి మరింత సన్నిహితంగాజేర్చి జెంకైషేక్ ఖాళీచేసిన ఆగ్నేయాసియాలోని సామ్రాజ్యవాదుల ప్రధాన ఉపగ్రహస్థానాన్ని ఇండియాకు అప్పజెప్పే ప్రయత్నాన్ని మరుగుపరచడానికి తప్ప మరొకటి కాదు.

అమెరికా సామ్రాజ్యవాదుల కీలుబొమ్మ ప్రభుత్వమైన ఫిలిప్పైన్సు "స్వతంత్ర" రాజ్యమని చెప్పబడే (ఈ దేశంలో యిప్పటికే అమెరికాకు 50 నావికా వైమానిక కేంద్రాలున్నాయి) ప్రతినిధి జనరల్ రోములా అసలు విషయాన్ని బయటపెట్టాడు:

"ఢిల్టీమహాసభ సాధించిన విజయాలలో అతి ముఖ్యమైన దేమంటే తూర్పు ఆసియాకు నాయకత్వం వహించడంమూలంగా ఆసియా ప్రజల హృదయాలను కమ్యూనిజం దొంగి

లించకుండా చేయగలిగామని నేను భావిస్తున్నా." (రాయిటర్, జనవరి 25)

## బర్మాకు చేసిన ద్రోహం

"మిత్రరాజ్యసమితి అంగనిర్మాణానికి లోబడి యీసభకు సంబంధించిన ప్రాంతాల మధ్య సంప్రదింపులూ, సహకారం జరుపుకొనేందుకు అవసరమైన మార్గాలను "వెతకాలన్న" తీర్మానాన్ని ఆమోదించడంతో, ఢిల్లీ సభయొక్క అసలు ఉద్దేశం బయటపడిపోయింది. ఇవి పైకిచూస్తే ఎలాంటి ప్రమాదంలేని మాటలుగా కపడతాయి. కాని ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులు పాశ్చాత్య దేశాలలో ఎలాంటి అబద్ధాలూ, మోసపు రాజకీయకబుర్లుచెప్పి అట్లాంటిక్ సంధికోసం ప్రయత్నించుతున్నారో, సరిగ్గా అదే కార్యక్రమాన్ని యిక్కడకూడా కొనసాగిస్తున్నారు. మిత్రరాజ్యసమితిలో తరువాత జరిగిన చర్చల వల్ల నెహ్రూప్రభుత్వ "తటస్థత", "స్వతంత్రత", ఇండోనేషియా సమస్యపై దాని "నాయకత్వం" - అన్నింటియొక్క మునుగూ సంపూర్తిగా బట్టబయలు అయింది. అమెరికా వారిచే ప్రతిపాదించబడిన తీర్మానం భద్రతా సమితిలో అంగీకరించబడి యిప్పటికి రెండుమాసాలకు పైగా అయిపోయింది. అయినా యీనాటికీ డచ్చివారు ఆ తీర్మానాన్ని ఆచరణలో పెట్టేందుకు ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు చిన్నఎత్తు ప్రయత్నమైనా చేయలేదు. ఇది వారు చేయకపోగా పైపెచ్చు ఆ తీర్మానాన్ని డచ్చి సామ్రాజ్యవాదులు దుడుకుతనముతో అతిక్రమించి ఇండోనేషియా గెరిల్లాలపై తమ రాక్షసయుద్ధాన్ని కొనసాగించడానికి పూర్తి అవకాశాన్ని ఆంగ్లో—అమెరికన్ సామ్రాజ్యవాదులు కలుగజేశారు.

ఇక యీ సందర్భంలో మిత్రరాజ్య సమితిలోవున్న నెహ్రూ ప్రభుత్వ ప్రతినిధి చేసిందల్లా ఏమంటే - ఎప్పటికప్పుడు బానిస బుద్ధితో అమెరికన్‌లకు మద్దతుగా వుండటమూ, ఇండోనేషియా స్వాతంత్ర్యంకోసం నిజమైన సహాయం చేసేందుకు సోవియట్ యూనియన్ చేసిన ప్రయత్నాలన్నింటికీ వ్యతిరేకించి అడ్డు తగలడం.

## V

ఇండోనేషియాపై జరిగిన యీసభ ముగిసిందో లేదో, మళ్ళీ ఢిల్లీలో మరొకసభ జరిగింది. ఈసారి "బర్మాపై సమాలోచనలు" జరపడానికని సభ. ఈ సభకూడా నెహ్రూ గారి పిలుపుపైనేజరిగింది. బ్రిటిష్ సామ్రాజ్యం తరఫున ఆస్ట్రేలియా సిద్ధంగా హాజరయింది.

ఈసభయొక్క నిజోద్దేశ్యమూ, నెహ్రూ ప్రభుత్వంయొక్క అసలుపాత్ర ఇదివరకు ఇండోనేషియాపై జరిగిన సభకంటే మరి ప్రత్యక్షంగానూ, నగ్నంగానూ బయటపడింది.

బర్మాలోని జాతీయవిముక్తి ఉద్యమం పొందుతున్న విజయపరంపరలకూ, సామ్రాజ్యవాదులతో కలసిపోయిన థాకిన్—నూ ప్రభుత్వాన్ని ఊడబెరకడానికి జరిగే ప్రయత్నానికీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భయపడి బహిరంగంగా బర్మా అంతరంగిక వ్యవహారాలలో

జోక్యం కలిగించుకొంటున్న విషయం అందరికీ తెలిసినదే. విప్లవశక్తులకు నిరోధంగా అభివృద్ధి నిరోధకులైన కెరన్లముఠాలను రెచ్చగొట్టి వారికి ఆయుధాలూ, మందుగుండు సామానునూ బ్రిటన్ సరఫరాచేసి సహాయపడుతున్నది. కెరన్ల ముఠాలకు బ్రిటన్ సలహాకూడావుంది.

థాకిన్—నూ ప్రభుత్వం తన కప్పజెప్పిన పాత్రను రోజురోజుకు నిర్వహించే శక్తిని కోల్పోవడంవల్ల, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ ప్రయోజనాలకోసం కెరన్లను ఎక్కుదోలడం ప్రారంభించారు. బర్మా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన బర్మీస్, కెరన్ శ్రామికప్రజలమధ్య రోజురోజుకూ వృద్ధి పొందుతున్న ఐక్యతాసంఘటనా పోరాటాన్ని విచ్ఛిన్నంచేసే ఉద్దేశ్యంతోనే సామ్రాజ్యవాదులు అభివృద్ధి నిరోధక "జాతీయ" కెరన్ 'రాజ్యాన్ని సంఘటితపరచడానికి పన్నాగాలు పన్నుతున్నారు.

కాని బర్మాలోని విప్లవశక్తులు సామ్రాజ్యవాదుల ప్లానులకంటే మునుముందుగానే త్వరత్వరగా పురోగమించుతూ, కొత్తప్రాంతాలకు వ్యాపించుతున్నాయి. కొన్ని ప్రదేశాలలో అప్పుడే అతివాద కెరన్ యువకులు కమ్యూనిస్టుపక్షంచేరి, తమ అభివృద్ధినిరోధక నాయకత్వంతో పోరాడటం ప్రారంభించారు.

కెరన్లు డిమాండ్ చేస్తున్న ప్రత్యేక రాజ్యాన్ని 'నూ' ప్రభుత్వం వెంటనే యిచ్చి వారితో రాజీపడి యిద్దరికీ సమానశత్రువుతో కలసి ఆంగ్లో - అమెరికన్ నాయకత్వాన పోరాడేటట్లు చేయవలసిన అత్యవసర పరిస్థితి నేడు సామ్రాజ్యవాదులకు ఏర్పడింది.

ఈ పైన ఉదహరించిన సామ్రాజ్యవాదుల ప్లానును కొనసాగించడానికే "బర్మాపై సమాలోచనల సభను" ఢిల్లీలో నెహ్రూ ఏర్పాటు చేశాడు. అంతే కాని బర్మా నిజమైన స్వాతంత్ర్యానికి పోరాడే అభ్యుదయ ప్రజాశక్తులకు సాయపడే నిమిత్తం యీ సభ ఎంత మాత్రమూ ఏర్పాటు చేయలేదు.

ఆర్థికస్థితిలో అసలే శతమతమవుతున్న థాకిన్-నూ ప్రభుత్వాన్ని తమకు పూర్తిగా దాసోహంకమ్మని లేబరు సామ్రాజ్యవాదులు ఒకవైపున బెదరించుతున్నట్లు యీక్రింది లండన్ వార్త ధృవపరుస్తున్నది:

"కెరన్లతో రాజీపడే షరతుపైనే, బ్రిటన్ బర్మాకు ఆర్థిక సహాయం చేయగలదని బ్రిటిష్ అధికారవర్గాలద్వారా నేడు తెలుస్తున్నది."

(టైమ్స్ ఆఫ్ ఇండియా, మార్చి 2)

మరోవైపున ఇండియా, ఆస్ట్రేలియాలు తయారుచేసిన నెహ్రూసభ బర్మాలో తాము కెరన్లకూ, థాకిన్-నూ ముఠాకు మధ్య "మధ్యవర్తిత్వాన్ని" వహించుతామనే అర్థంలేని ప్రతిపాదనలను చేసింది. ఈ సందర్భంలో బ్రిటిష్‌వారి తొత్తు అయిన థాకిన్-నూ ప్రభుత్వం సహితం వెంటనే యీ "నెహ్రూ నాయకత్వాన్ని" దిగమింగలేక ఇతరుల జోక్యాన్ని ప్రతిఘటించుచున్నట్లు పైకి నాటకం ఆడేందుకు "మధ్యవర్తిత్వాన్ని" నిరాకరించడం గమనించవలసిన విషయం.

ఆ తరువాత కెరన్ల ప్రత్యేక రాజ్య డిమాండ్‌కు థాకిన్—నూ ప్రభుత్వం తన ఆమోదాన్ని తెలిపి "దేశాన్ని రక్షించేందుకు తన యావత్తుశక్తినీ వినియోగించి తోడ్పడాలని" కెరన్లకు దీనంగా విజ్ఞప్తిచేసింది.

ఈ ప్లానంతటికీ వెనకనున్నది ఎవరో, ఇందులో నెహ్రూపాత్ర ఎంతవుందో అంతా అమెరికా సామ్రాజ్యవాదుల పత్రిక "న్యూయార్కు టైమ్సు" స్పష్టంగా బయటపెట్టింది. మార్చి 15వ తేదీన "న్యూయార్కు టైమ్సు" యీలరాసింది:

"థాకిన్—నూ, కెరన్లకు ప్రత్యేక స్వతంత్ర రాజ్యాన్ని యివ్వడానికి అంగీకరించాడంటే, యిదివరకు ఢిల్లీలో అయిదు కామన్‌వెల్తు రాజ్యాలూ సమావేశమై కెరన్లతో రాజీపడమని యిచ్చిన సలహాను మొట్టమొదట్లో తిరస్కరించినా చివరకు అంగీకరించాడన్నమాట."

అమెరికా సామ్రాజ్యవాదులు బర్మా విషయంలో అంత అత్యవసరంగా ఎందుకు జోక్యాన్ని కల్పించుకొనగోరారో కూడా "న్యూయార్కు టైమ్స్" బయటపెట్టింది.

"బర్మాలో అత్యంత క్లిష్టపరిస్థితులు ఏర్పడ్డాయి. అది వేడు చైనాబాటను పోయే ప్రమాదంవుంది. ప్రస్తుతప్రభుత్వాన్ని కాపాడేందుకు సకాలంలో సహాయం వస్తోందోలేదో చూడవలసి ఉంది."

## అసలు రహస్యం.

బర్మాపై సమాలోచనలు జరపడానికి తానెందుకు కామన్‌వెల్తు రాజ్యాల సమావేశాన్ని ఏర్పాటుచేశాడో ఢిల్లీలో మార్చి 6 వ తేదీన జరిగిన పత్రికా ప్రతినిధుల సమావేశంలో వివరించుతూ నెహ్రూ యే స్వయంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల మాటలనే సరిగ్గా పునశ్చరణచేశాడు. ఎలాంటి సందేహానికి తావులేకుండా తన పాత్రను కూడా బయటపెట్టుకొన్నాడు. ఆయన యిలా అన్నాడు:

"ప్రస్తుత పరిస్థితులు యీవిధంగానే కొనసాగేపక్షంలో ఇటు కెరన్లూ, అటు బర్మాప్రభుత్వమూ గాకుండా యితర శక్తులు ప్రముఖపాత్రను నిర్వహించవచ్చుననే భయం బ్రిటన్‌కూ, తదితర ప్రభుత్వాలకూ ఉన్నదని నేను భావిస్తున్నా. ఆ యితరశక్తులు ప్రఖపాత్రను తీసుకోవడం వారి కిష్టంలేదు."

ఈ సమావేశముకూడా యింతకుముందు ఇండోనీషియాపై జరిగిన సమావేశంలాగానే ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదుల తరఫున జరుపబడిందని చూపెట్టడానికి యింతకంటే స్పష్టమైన సాక్ష్యం ఇంకేమికావాలి? ఈ విధంగా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు యితర దేశాల ఆంతరంగిక విషయాలలో జోక్యం కలుగజేసుకొనే తమ దుర్మార్గపద్ధతిని నెహ్రూను అడ్డంపెట్టుకొని మరుగపరచదలచుకొన్నారు.

సామ్రాజ్యవాదుల విప్లవ ప్రతీఘాతకుట్రలకూ, ఆగ్నేయాసియాలో సోవియట్ వ్యతిరేక కుట్రలకూ, "ఆసియాఖండ నాయకత్వం", "తటస్థత" అనే మాటలతో నెహ్రూ ప్రభుత్వం ఏవిధంగా మరుగుతెరగా ఉపయోగపడుతున్నదో లండన్ నగరంలోని గుత్తపెట్టుబడిదారుల పత్రిక 'ఎకానమిస్టు' ప్రధాని నెహ్రూపై వలకబోసే మెహర్బానీనిబట్టి తెలుస్తుంది. నెహ్రూను "గొప్ప మేధస్సుగల ఒక రాజకీయవేత్తగా" పొగడుతూ 'ఎకానమిస్టు' పత్రిక అతని బర్మా సభపై యిలావ్రాసింది:

"అతడు మొట్టమొదటిసారిగా ఇండోనీషియా సమస్యపై సమాలోచన జరిపేందుకు ఆసియా జాతులను సమావేశపరచాడు. ఈ విధంగా అతడు రష్యా సామ్రాజ్య వ్యతిరేక నాయకత్వాన్ని దెబ్బ

కొట్టి ఈ సమస్యపై ఆసియా అభిప్రాయానికి నాయకత్వం వహించగలిగాడు... ఇప్పుడు తిరిగి ఆయన కామన్‌వెల్తు రాజ్యాల కుటుంబాన్ని ఒకచోట సమావేశ పరచాడు. దీని ఫలితం ఏమనగా బర్మాలో తిరిగి సామ్రాజ్య తత్వాన్ని బ్రిటన్ పునరుద్ధరిస్తున్నదన్న అపవాదు దానికి రాకుండా ఒకవైపున చేయగలిగాడు. మరోవైపున తన తూర్పు సరిహద్దులో జరుగుతున్న విషాదపరిస్థితిని ఎదుర్కొనేందుకు తనొక్కడే ఒంటరిగా గాక యితరులనుకూడా సమీకరించాడు." (హిందూపత్రిక మార్చి 6)

కాబట్టి బర్మావ్యవహారాలలో నెహ్రూ ప్రభుత్వం జోక్యం కలిగించుకోవడం అది చెప్పుకొంటున్నట్లుగా "స్వతంత్ర" విదేశాంగ విధానాన్ని అనుసరించడానికిగానీ, లేక బర్మాలో 'శాంతిని' నెలకొల్పడానికిగానీ ఎంతమాత్రమూ కానే కాదు. పైగా ఈవిధంగా జోక్యం కలిగించుకోవడం బర్మా శ్రామిక ప్రజలపై సామ్రాజ్యవాదుల దురాక్రమణకు సహాయపడి ప్రోత్సాహ పడటానికిమాత్రం ఉద్దేశించబడింది. అంతేకాదు. ఆగ్నేయాసియాలో సోవియట్ వ్యతిరేకకూటమిని నిర్మించేందుకు సామ్రాజ్యవాదులు పన్నుతున్న కుతంత్రాలకు నెహ్రూప్రభుత్వం సాయపడుతున్నది.

## బర్మాలో భారత పెట్టుబడివారుల ప్రయోజనాల రక్షణ

దక్షిణ బర్మాలో నూటికి దాదాపు 80 పాళ్ళు భూమిపై పెత్తనాన్ని చెలాయిస్తున్న చెట్టియార్లూ, యింకా యితర భారతీయ పెట్టుబడిదారీ, భూస్వామిక ముఠాల ప్రయోజనాలను నమ్మకంగా కాపాడే రక్షకురాలుగా నెహ్రూప్రభుత్వం నేడు తయారయింది. ఈ భారతీయ పెట్టుబడిదారీ భూస్వామిక వర్గాలే బ్రిటిషు గుత్తపెట్టుబడిదారులతోకూడి బర్మా శ్రామిక ప్రజానీకం రక్తాన్ని తెగ త్రాగుతున్నాయి.

అసలు నిజానికి బర్మాలోని భూమిపై భారతీయ వడ్డీ పెట్టుబడిదారులకున్న గుత్తాధికారాన్నీ, బర్మా ఎగుమతి వ్యాపారంలో దాదాపు సగానికి పైన ఇండియా ప్రభుత్వానికిగల గుత్తాధికారాన్నీ బ్రిటిష్ లేబరు సామ్రాజ్యవాదులు జయప్రదంగా వినియోగించుకొని "నూ" ప్రభుత్వాన్ని బెదరించి లొంగదీస్తున్నారు ఈవిధంగా వారు "స్వతంత్ర" బర్మాను సరైన పట్టాలమీద ఉంచి, కామన్‌వెల్తు చక్రాలకు భద్రంగా కట్టిపెట్టి ఉంచడానికి ప్రయత్నించుతున్నారు!

బర్మాపై ప్రధాని నెహ్రూ పిలిచిన "సమాలోచనల సమావేశానికి" చాల ప్రాముఖ్యత ఉన్నదని చెప్పడానికి మరొక ముఖ్య విషయంకూడావుంది. అదేమంటే యీసమావేశంలో ఆగ్నేయాసియాకు బ్రిటిషు కమీషనరూ, మలయాప్రజల గొంతులు కోస్తున్న ఖూనీకోరు అయిన "ప్రఖ్యాత" మాల్కామ్ మాక్డనాల్డు పాల్గొన్నారు.

# VI

"తటస్థ విధానమనీ", "స్వతంత్ర పంథా" అనీ, "ఆసియా నాయకత్వమని" ఒకవైపున ప్రధాని నెహ్రూ అమాయకులను మోసపుచ్చడానికి కుత్రసంగా మాట్లాడుతూ వుంటే, సర్దార్ పటేల్ యింకా యితర ప్రభుత్వ మంత్రులూ ఎలాంటి దాపరికమూ లేకుండా ఆగ్నేయాసియాలో "కమ్యూనిజానికి వ్యతిరేకంగా" ఒకకూటమిని నిర్మించే విషయంలో ఇండియా పాల్గొంటున్నదని బాహాటంగా ప్రకటించుతున్నారు. ప్రభుత్వానికి నిజమైన యజమానులుగా వుంటున్న భారత బడా పెట్టుబడిదారులుకూడా యీవిషయంలో ఎలాంటి దాపరికం లేకుండా స్పష్టంగా చెప్పేస్తున్నారు.

బిర్లాపత్రిక "ఈస్టరన్ ఎకానమిస్టు" "స్వతంత్ర" పంథా "నాయకత్వం" మొదలుగాగల నెహ్రూ పదాడంబరాన్ని మొండిగా త్రోసిపారవేసి అసలు నెహ్రూ విదేశాంగ విధాన నిజవైఖరిని ఉన్నది ఉన్నట్లుగా చెప్పివేసింది. (అయితే యిందులో కూడా రాజ్యాంగ పరిభాషా, పదాలువాడటం జాగ్రత్త ఉన్నదనుకోండి).

"ఆచరణలో రాజకీయ డొంక తిరుగుడు పదాలు ఏమి చెప్పినప్పటికీ – మన విదేశాంగ విధానానికి ఒక ఖచ్చితమైన వైఖరి అంటూ నేడు ఏర్పడి పోయింది. కామన్‌వెల్తుతో ప్రధానంగా స్నేహపూరితంగా వుండే విదేశాంగ విధానం వైపుకు మనం మొగ్గాం...సోవియట్ యూనియన్‌తో కంటే అమెరికాతోనే సన్నిహితంగా వుండే బ్రిటిషు కామన్‌వెల్తుతో సంబంధాన్ని ఉంచుకొంటున్నామంటే దాని అర్థం ఆచరణలో మనం అమెరికా వైపుకే మొగ్గుతున్నామన్నమాట. ఈ రాజకీయ యదార్థం యొక్క పర్యవసానాన్ని గురించి స్పష్టంగా తెలుసుకొని వుండాలి. మిత్రరాజ్య సమితిలోకనీ, మరొక చోటగాని ఏవో స్వల్ప విషయాలలో తప్ప తతిమ్మ అన్ని ప్రధానసమస్యలలోనూ కామన్‌వెల్తుకూ అమెరికాకూ, విరుద్ధంగా వుండే వైఖరిని మనం తీసుకోలేము." (డిసెంబరు 31,1948)

ఆ విధమైనపాలసీ ఎలాంటి రకం "నాయకత్వమూ" అనిపించుకోదని ప్రతివారికీ తెలుస్తుంది. ఆ విధమైనపాలసీని అనుసరించడం "నాయకత్వం" కాకపోగా పైగా అది చైనాలో విజయపరంపరలను పొందుతున్న ప్రజల విప్లవానికీ, ఆగ్నేయాసియాలో ప్రజ్వరిల్లుతున్న విముక్తి ఉద్యమాలకూ, సోషలిస్టు సోవియట్ యూనియన్‌కూ, వ్యతిరేకంగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు కొనసాగిస్తున్న కుట్రలలో పాల్గొనడంతప్ప మరొకటి కాదు.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన జయప్రదంగా పురోగమిస్తున్న చైనా ప్రజల విప్లవమూ, చియాంగైషెక్ పూర్తి పతనమూ దూరప్రాచ్యంలోని వివిధశక్తుల బలాలలో పూర్తి మార్పును తెచ్చింది. పరిస్థితులు సామ్రాజ్యవాదానికీ, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగానూ, సోషలిజానికి అనుకూలంగానూ బాగా మారాయి. చైనా ప్రజా విప్లవవిజయాలు, మలయా, బర్మా ఇండో

నీషియా, ఇండో చైనాలలోని జాతీయవిముక్తి ఉద్యమాలకు అపూర్వమైన ప్రోత్సాహమిచ్చాయి.

● మలయాలో యింతకు ముందెన్నడూ చేయనంత అమానుష అత్యాచారాలు బ్రిటిషు వారు (నెహ్రూ ప్రభుత్వంచే పంపబడిన గుర్ఖా సైన్యాల సహాయంతో) చేసినప్పటికీ మాక్డనాల్డు, లార్డులిస్టోవర్ లాంటి బ్రిటిషు అధికారులే పరిస్థితులు "చాల విషమంగా" ఉన్నాయని అంగీకరించుతున్నారు.

● బర్మాలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన జాతీయవిముక్తి సైన్యాలు ముందుకు పురోగమించుతూంటే థాకిన్-నూ ప్రభుత్వం కంపించిపోతున్నది.

● ఇండో-చైనాలో ఫ్రెంచి సేనలు దాదాపు పూర్తిగా వియత్ నామీలచే తుడిచి పెట్ట బడ్డాయి. దేశంలోని అత్యధికభాగం కమ్యూనిస్టుల ఆధీనంలోవున్నట్లు, యిటీవల మద్రాసు పత్రిక 'హిందూ' ఒక లండన్ వార్తను ప్రకటించింది.

● ఇండోనీషియాలో సామ్రాజ్యవాదుల పాలసీ వారిని చాల గందరగోళంలోకి పడ వేస్తున్నది. మరోవైపున గెరిల్లా ఉద్యమం రోజురోజుకూ బలాన్ని సంపాదించుకుంటూ తీవ్రరూపం దాల్చుతున్నది.

విజృంభించుతున్న విప్లవప్రవాహం దక్షిణ వైపుకు ప్రవహించి, వియత్ నామ్ బర్మాల గుండా ఇండియాలోకి, తిరుగుబాటుచేస్తున్న మలయాలోకి ప్రవహించవచ్చునని సామ్రాజ్య వాదులు చాల కంగారుపడుతున్నారు.

తమ వలసదేశాలలో యీ విధమైన పరిస్థితులు వుంచుకొని మరొకవైపున సామ్రాజ్య వాదుల ప్రపపంచం యిదివరకెన్నడూ ఎరగనంతటి విపరీతంగా ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కో-బోతున్నది.

## సామ్రాజ్యవాద దోపిడీ దొంగల ప్లానులు

అమెరికన్ ప్రజలజీవన ప్రమాణం క్రమేణా తగ్గిపోవడంవల్ల స్వదేశంలో వారి వస్తువులకు మార్కెట్టు తగ్గిపోతున్నది. పెట్టుబడిదారీ ప్రపంచానికీ మూలపీఠం అయిన వాల్ స్ట్రీట్ లోనే బ్రహ్మాండమైన ఆర్థిక సంక్షోభం ఆవరించే అనేక సూచనలు కనపడుతున్నాయి.

ఈ పరిస్థితులలో డాలర్ సామ్రాజ్యవాదులు కూలిపోయే తమ వ్యవస్థను కాపాడుకొనేందుకు ప్రస్తుతం తన దయాదాక్షిణ్యాలపై ఆధారపడుతున్న తన పోటీదారుల "భుక్తంలో వున్న రాజ్యాలపై ఆధిపత్యాన్ని స్థాపించడానికి" వలస ప్రపంచంపై దారుణమైన దాడిని ప్రారంభించారు. ఆఫ్రికా, సమీపప్రాచ్యం, దూరప్రాచ్యం ఆగ్నేయాసియా-యివన్నీ వాల్ స్ట్రీట్ డాలర్ బడా పెట్టుబడిదారుల అతిదారుణమైన దాడికి లక్ష్యాలయ్యాయి. ప్రపంచమంతటావున్న శ్రామిక ప్రజాకోటిని ఫణిగా పెట్టి తనకు రాబోతున్న సంక్షోభాన్ని పరిష్కరించుకొనేందుకు అమెరికా ప్రభుత్వం తుది ప్రయత్నంచేస్తోంది.

ఇటీవల ట్రూమన్ తన అధ్యక్షోపన్యాసంలో యీదాడిని గురించి ప్రస్తావించాడు. అందులో అతడు అమెరికా ప్రభుత్వం ముం

దున్న నాలుగు ప్రధాన కర్తవ్యాలలో "ప్రపంచంలో వెనుక బడ్డ ప్రాంతాలను అభివృద్ధి చేసేందుకు" అమెరికా వారికి తమ పెట్టుబడిని వినియోగించడాన్ని ఒకటి పేర్కొన్నాడు. పెట్టుబడులను ఎగుమతిచేసి, వలసదేశ ప్రజలను అమితంగా దోచుకోవడంద్వారా విపరీతమైన లాభాలను సంపాదించుకోవడం, పాతకాలం నాటినుండీ ఉన్న సామ్రాజ్యవాదుల పంథా ఇది పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో వుండే ప్రాథమిక విషయం. డాలర్ గుత్త పెట్టుబడిదారులు లాభాల కొరకు కాదని ఎంతపైకి ప్రదర్శించుకొన్నా యీమోసాన్ని దాచడం అసాధ్యమైన విషయం.

ఆగ్నేయాసియాలోనూ, యింకా యితర వలస ప్రపంచంలోనూ, విప్లవోద్యమాలపై డాలర్ సామ్రాజ్యవాదుల నేటి విపరీతమైన రాజకీయదాడికి ఆర్థిక ప్రాతిపదిక యిదే.

వాల్‌స్ట్రీట్ బడా పెట్టుబడిదారులు, ఇండోనీషియా సంపదనంతటినీ అమాంతంగా దోచుకొన్నారు. హట్టా ప్రభుత్వంతో అమెరికా కార్పొరేషన్ చేసుకొన్న కాంట్రాక్టు ఒప్పందంమూలంగా ఇండోనీషియాలోని నూనెగనులూ, రబ్బరూ యింకా యితర ముడిపదార్థాల వ్యాపారంలో గుత్తాధికారమూ అమెరికన్ కార్పొరేషన్‌కు లభించింది. దీనికితోడు ఇండోనీషియా విదేశ వ్యాపారమంతా యీ కంపెనీకే గుత్తకివ్వబడింది. ఇండోనీషియా సమస్యపై అమెరికా వారిపాలసీ అంతరార్థం తెలిసికోవాలంటే పైవిషయం స్పష్టంగా వివరించుతుంది.

అమెరికా నేడు మలయా, బర్మాలలోకికూడా వ్యాపించుతోంది. బ్రిటన్ అమెరికా సాయంకోసం తహతహలాడుతున్నది. ఫ్రెంచి సామ్రాజ్యవాదులుకూడా అంతే. అలాగే ఆస్ట్రేలియాకూడా మార్కెట్లను కోరుతున్నది

ఎందుకనో సామ్రాజ్యవాద దోపిడీదొంగలంతా – వారిలో వారికి అంతర్గతంగా ఎన్ని తగువులున్నప్పటికీ – అమెరికా సర్వాధిపత్యాన, కూలిపోతున్న వలసదేశాలపై తను ఆధిపత్యాన్ని కాపాడుకొనేందుకు ఆసియాలోని విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగానూ, చైనా ప్రజల విముక్తిసైన్యాల విప్లవశక్తులకు వ్యతిరేకంగానూ మిలిటరీ – ఆర్థిక కూటమిని నిర్మించుతున్నారు.

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికకోసం జరుగుతున్న సంప్రదింపులతోపాటు వలసదేశాల విస్తరణకోసం వాల్‌స్ట్రీట్ దాడిని ప్రారంభించడం ఏదో యాదృచ్ఛికంగా జరుగుతున్న సంఘటనగాదు. ఇతరవిషయాలను అటుంచి, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక ముఖ్యంగా వలసదేశాల ప్రజల "జాతీయవిముక్తి" ఉద్యమాలను అణచివేసే వుద్దేశ్యంగల సామ్రాజ్యవాద బందిపోటు దొంగల సమైక్యత. ఈ దొంగలగుంపు ఐక్యసంఘటనకు అమెరికా సామ్రాజ్యవాదం నాయకత్వం వహించింది.

ఆగ్నేయాసియాకు సంబంధించినంతవరకూ డాలర్ సామ్రాజ్యవాదుల ఎత్తుగడ ఏమంటే: ఆసియాఖండంలోని జాతీయ విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా తమతోపాటు పోరాడేందుకు తమక్రింద తొత్తులుగా వినియోగపడే కీలుబొమ్మ ప్రభు

జ్యాల కూటమిని నిర్మించడం; సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధం చేసేందుకు వ్యూహా కేంద్రంగా వినియోగపడే కూటమిని నిర్మించడం. ఈ రకమైన ముఠా, యీ విధమైన కూటమి అట్లాంటిక్ ఒడంబడికకు ఒక అనుబంధంగా వుండేందుకు ఉద్దేశించబడింది. ఈరకమైన కూటమిని నిర్మించేందుకే నేడు బ్రిటనుకూ ఇండియాతో సహా యితర కామన్‌వెల్తు దేశాలకూ మధ్య పసిఫిక్ సంధిచేసుకోడానికి రాయబారాలు కొనసాగుతున్నాయి. ఈ కార్యసిద్ధికోసమే ప్రస్తుతం బ్రిటిషు మంత్రులూ, ప్రముఖ రాజకీయవేత్తలూ ఢిల్లీకీ, కాన్‌బెర్రాకూ, కెనడా, దక్షిణాఫ్రికాలకు అత్యవసర సంప్రతింపులకోసం పిలపించబడ్డారు.

సరిగ్గా అలాంటి కూటమికే - అమెరికా సామ్రాజ్యవాదుల సర్వాధిపత్యం వుండే కూటమి నిర్మాణానికే - ప్రధాని నెహ్రూ ఇండోనీషియాపైనా, బర్మాపైనా ఢిల్లీలో పిలిచిన సమావేశాలు పునాదిని వేశాయి.

## VII

## వీరి కుట్రలకు సామ్రాజ్యవాద పత్రికలే సాక్ష్యం

కొత్త ఢిల్లీలోనూ, కెనబెర్రాలోనూ బ్రిటిష్ అధికారులు రహస్యంగా పన్నుతున్న కామన్‌వెల్తు కుట్రల నిజవైఖరిని తెలుసుకోడానికి అవసరమైన సమాచారాన్ని సామ్రాజ్యవాద పత్రికలు ప్రచురించాయి.

“దూరప్రాచ్య పరిస్థితులు చాల వేగంగా విషమించిపోతున్నాయనీ, వెంటనే ఆగ్నేయాసియాకు కామన్‌వెల్తు దేశాలకూ మధ్య పటిష్ఠమైన సహకారం అత్యవసరంగా జరగవలసి ఉందని” బ్రిటిష్ ప్రభుత్వాధికారులు ప్రకటించినట్లుగా మార్చి 15వ తేదీన లండన్ నుండి వెలువడిన యు. పి. ఎ. వార్త తెలుపుతున్నది. అంతేకాక ఆవార్తలో “ఆగ్నేయాసియా అంతటా పరిస్థితులు త్వరత్వరగా అధ్వాన్నమవుతున్నాయని” అధికార. రిపోర్టులు తెలియజేస్తున్నాయని కూడా వుంది.

ఈ అధికారులింకా యిలా చెప్పారు “కమ్యూనిజాన్ని ప్రతిఘటించే విషయంలో ఆగ్నేయాసియా దేశాల ప్రయోజనాలూ పాశ్చాత్యరాజ్యాల ప్రయోజనాలు చాలవరకు కలుస్తాయి. ఈ దేశాలు అభివృద్ధికరంగా తమ స్వపరిపాలనా బాధ్యతలను తీసుకొనే వరకూ ఈ దేశాలలోకి కమ్యూనిజం వ్యాపించకుండా ప్రాశ్చాత్యదేశాల ప్రభుత్వాలు తప్పకుండా సహాయపడగలవు. పశ్చిమ యూనియన్‌కూ, అట్లాంటిక్ ఒడంబడిక నిర్మాణానికీ లోబడి కలసి ఖచ్చితమైన కార్యక్రమాన్ని ఇంకా తీసుకోనకపోవడానికి కారణం కనపడదు.”

(బొంబే క్రానికల్ మార్చి 16)

మార్చి 14వ తేదీన లండన్‌నుండి వెలువడిన “ప్రెస్‌ట్రస్ట్ ఆఫ్ ఇండియా” (ఇటీవలనే భారతీయ పెట్టుబడిదారీ పత్రికల యజమానులు పి. టి. ఐ. అనే పేరుతో ఒక వార్తా

పంథను స్థాపించారు. దీనిని బ్రిటిష్ సామ్రాజ్య వాదుల వార్తాసంస్థ అయిన రాయిటర్ తో కలిపారు. అందువలన దీనిని పి. టి. ఐ.– రాయిటర్ అని పిలుస్తారు – అనువాదకుడు) ప్రకారం ఆస్ట్రేలియా మంత్రి డాక్టర్ ఇవాట్ "పసిఫిక్ ప్రాంతీయ రక్షణ ఒడంబడికను కుదుర్చుకొనేందుకు గల అవకాశాలను గురించి" బెవిన్ తో సంప్రతింపులు జరిపాడు. ఆ వార్తలో యిలా వుంది:

"అలాంటి ఒడంబడిక ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక వున్న పద్ధతులలోనే ఉంటుంది...ఈ ఒడంబడికలో తప్పకుండా సభ్యులుగా చేరే దేశాలు అమెరికా, కెనడా, బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్,ఇండియాలు ఐ ఉంటాయని నమ్మబడుతోంది. అట్లాంటిక్ ఒడంబడికలోనూ పసిఫిక్ సంధిలోనూ – రెండింటిలోనూ సభ్యత్వాన్ని కలిగి ఉండటం వలన యూరప్ రక్షణ ఏర్పాట్ల విషయంలో సంబంధాన్ని కలపడానికి వీలవుతుంది."

(హిందూ, మార్చి 15)

ఆస్ట్రేలియా రక్షణశాఖామంత్రి డేడ్‌మన్ "బ్రిటిష్ దేశాలతోనూ, బ్రిటిషేతర దేశాలతోను కలసి ఒక పసిఫిక్ ప్రాంతీయ రక్షణ ఒడంబడికను చేసుకోవడానికి" చర్చలు కొనసాగుతున్నాయని అప్పుడే కెనబెర్రాలో (మార్చి 14) ప్రకటించాడు. "ఈ ఒడంబడిక "అట్లాంటిక్ ఒడంబడిక పద్ధతులలోనే ఉంటుందని" కూడా అతడు స్పష్టంగానొక్కి చెప్పాడు. ఈ సంప్రతింపులలో బ్రిటన్ "ప్రధాన పాత్రను" తీసుకొన్నదని కూడా అతడు తెలిపాడు. ఇండియా రిపబ్లిక్ కావాలనే విషయం "యీ రక్షణ ప్లానులకు ఏ మాత్రం భంగకరం కాదని" అతడు ప్రత్యేకంగా ఉదహరించి "పసిఫిక్ మహాసముద్రానికి రెండువైపులా వున్న దేశాలన్నీ యీ ఒడంబడికలో చేరవలసిందిగా ఆహ్వానించబడ్డాయని" తెలియజేశాడు.

ఆస్ట్రేలియాకు బ్రిటిషు ప్రభుత్వంచే సంప్రతింపులకోసం పంపబడిన లార్డులిస్టోవల్ ప్రస్తుతం జరుగుతున్న రాయబారాలకు అసలు కారణం "చైనాలో కమ్యూనిజం పలుకుబడి రోజురోజుకు వృద్ధి పొందడం", "ఆగ్నేయాసియాలో కమ్యూనిజం వ్యాపించడం", "మలయాలో వున్న విషమ పరిస్థితి" – యివన్నింటి మూలంగా "పసిఫిక్ మహాసముద్ర ప్రాంతంలో సామ్రాజ్య రక్షణను బాగు పరచుకోవడానికే" నని అధికారరీత్యా ప్రకటించినట్లు తెలుస్తుంది. అంతేకాదు. మలయాలోని ప్రజాఉద్యమానికి కలకత్తాలో జరిగిన భారత కమ్యూనిస్టుపార్టీ ద్వితీయ కాంగ్రెసు కూ అతడు సంబంధాన్ని కలిపాడు. ఇది కూడా గమనించతగ్గ విషయమే. (హిందూ మార్చి 16)

ఆస్ట్రేలియా మంత్రివర్గంతో బ్రిటిష్ రాయబారి లార్డు లిస్టోవల్ సంప్రతింపులు జరుపుతున్న సమయంలో లండన్ టైమ్సు కన్‌బెర్రా విలేఖరి వ్రాస్తూ (యీ రిపోర్టును కలకత్తా స్టేట్సుమన్ పత్రిక మార్చి 17వ తేదీన ఉదహరించింది.) జరుగబోయే పసిఫిక్ ఒడంబడిక "అంట్లాండిక్ ఒడంబడిక వలెనే దురాక్రమణకు వ్యతిరేకంగా సభ్యులు పరస్పర సహాయం చేసుకోవడాన్ని గ్యారంటీ చేస్తుందనీ, ఈవిధంగా ఒక అంతర్జాతీయంగా రాజ్యాల సముదాయం ఏర్పడుతుందనీ అట్లాంటిక్, పసిఫిక్ ప్రాంతాలకు అమెరికా ఒక లింకుగా ఉంటుందనీ, పసిఫిక్ హిందూమహాసముద్రప్రాంతాలకు ఆస్ట్రేలియా లింకుగా వుంటుందని" తెలియజేశాడు.

ఏర్పాటు చేసుకోవాలనుకుంటున్న యీ పసిఫిక్ ఒడంబడిక వైఖరిని తెలుసుకోవ

డానికీ, దాని మూలకర్త లెవరో, దాని ప్రయోజన మేమిటో తెలుసుకోవడానికి పైన ఉదహరించిన స్పష్టమైన సాక్ష్యంకంటే మరి కావలసిం దేముంది?

ఆసియాఖండంలోని జాతీయ విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదుల నాయకత్వాన్న ఏర్పడు తున్న విప్లవప్రతిఘాతకూటమితప్ప యిది మరొకటికాదు. "కమ్యూ నిజానికి వ్యతిరేకంగా రక్షణకోస మనే" దివాళకోరు నినాదంతో కూలిపోతున్న తమ సామ్రా జ్యాన్ని కాపాడుకొనేందుకు సామ్రాజ్యవాదుల ప్రయత్నం తప్ప యిది మరొకటి కాదు. సామ్రాజ్య దురాక్రమణకోసం, సోవియట్ యూనియన్‌పైకీ, ప్రజా స్వామిక ప్రజాతంత్ర, సోషలిస్టు శక్తులపైకీ మరొక నూతన ప్రపంచ యుద్ధాన్ని తెచ్చిపెట్టడానికి ప్రపంచమంతటా మిలిటరీ వ్యూహ్యాకేంద్రాలను నిర్మించేం దుకూ, అట్లాంటిక్ ఒడంబడికకు ఒక అనుబంధంగా వుండేందుకూ, యీ పసిఫిక్ ఒడంబడిక ఉద్దే శించబడింది.

## ఇండియాకు నిర్ణయించబడిన కీలకపాత్ర

మార్చి 12వ తేదీన వాషింగ్టన్ నుండి వెలువడిన ఒక యు. పి. ఎ వార్త యీ ఒడంబడికద్వారా ఇండియా నిర్వహించ డానికి నిర్ణయించిన కీలకపాత్రను బయట పెట్టింది. ఆవార్త యిలా తెలుపుతూఉంది:

"ఇండియాలోనూ, యితర ఆగ్నే యాసియా దేశాలలోనూ వ్యాపించుతున్న కమ్యూనిజాన్ని గురించి అమెరికా అధికా రులు చాల ఎక్కువగా ఆందోళన చెందు తున్నారు. అందువలన ఆప్రాంతంలో సోవియట్ పురోగమనాన్ని అరికట్టేందుకు ప్రస్తుతం అవసరమైన జాగ్రత్తలను గురించి ఆలోచించుతున్నారు.........ఈవిధమైన ఆలోచనలకు ఇటీవల ఇండియాలో కమ్యూనిస్టు అల్లర్లు జరిగాయని వచ్చిన రిపోర్టులు మరింత ప్రోత్సాహమిచ్చాయి. ఈస్ట్ఇండీస్‌నుండి బొంబాయివరకూ వున్న ప్రాంతంయొక్క అస్తిత్వాన్నీ, నిలకడను కాపాడేందుకు ఆప్రాంతంలో ప్రజాతంత్ర కోటగా ఇండియా వుపకరించగల దని ఈనాటివరకూ ఇండియాపై వారు ప్రము ఖంగా తమ దృష్టిని కేంద్రీకరించి ఉన్నారు." (హిందూ మార్చి 15)

ప్రపంచ బ్యాంకు, అమెరికా ఎగు మతి-దిగుమతి బ్యాంకు-ద్వారా "ఇండియాకు అమెరికా చేయగలిగిన" అవకాశాలను గురించి ఒక జాబితాను ఉదాహరించిన తరు వాత ఆవార్త యింకా యిలా చెపుతుంది:

ఆ ప్రాంతంలో సోవియట్ దాడిని (?) ఎదుర్కొనేందుకు గొప్పగొప్ప నిపుణులు అప్పుడే ప్లానులను ఆలోచించు తున్నారు...ఆసియాలో కమ్యూనిస్టుల

పురోగమనాన్ని అడ్డుకోవడానికి ఇండియా ఒక్కటే నిలకడగల కీలక ప్రదేశం. చైనాలో కమ్యూనిస్టులు దక్షిణ వైపుకు పురోగమించుతూ వుండడం వలన అత్యవసరంగా పనులు జరగాలన్న ఆలోచనకు మరింత దోహదం కలిగింది."

తన ఉపగ్రహ కూటమిలో డాలర్ సామ్రాజ్యవాదులు ఇండియాకు ఎంతటి నీచమైన కానిసపాత్రను అప్పజెప్పుతున్నారో అర్థంచేసుకోడానికి ఇంతకంటే స్పష్టమైన రుజువు ఇంకేమి కావాలి? భారత పెట్టుబడిదారీ వర్గం-టాటాలూ, బిర్లాలూ, వారికి నాయకత్వం వహించే నెహ్రూ), పటేళ్ళకు బడా సామ్రాజ్యవాదులు తమవద్దనున్న కొన్ని ఎంగిలి మెతుకులను - మార్కెట్లను - ఆశపెట్టి యిదే "అమెరికా సాయం" అని తమకింద ఉంచుకొంటున్నారు.

ఈ కూటమిలో జేరి మార్కెట్ల కోసం నెహ్రూ పటేళ్లు ఎంత నీచానికి పాల్పడుతున్నారో చూడండి! ఆగ్నేయాసియాలో సామ్రాజ్యవాదులకు లంచగొండి ఏజెంటుగా ఇండియాను తయారు చేసి, ఇండియా తదితర ఆగ్నేయాసియా దేశాలలోని ప్రజల విముక్తి ఉద్యమాలకు వెన్నుపోటు పొడిచి, ఇండియాను సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు పన్నుతున్న యుద్ధతంత్రానికి మిలిటరీ వ్యూహ కేంద్రంగా మార్చడానికే తయారయ్యారు.

దీని ఫలితం ఏమిటో భారత శ్రామిక ప్రజాకోటికి స్పష్టంగా విదితమే.

"అమెరికా సహాయం" అంటే అర్థం వాల్ స్ట్రీట్ ప్రయోజనాలకోసం దేశాన్ని మరింత ఎక్కువగా ఆర్థికంగా దోపిడీ చేయడమన్న మాట. ఇండియాను వాల్ స్ట్రీట్ వలస అనుబంధంగా మార్చడమన్న మాట.

## అమెరికా సహాయానికి అర్థం

ప్రపంచ బ్యాంకు ఔదార్యం అంటే ఏమిటో మనం యిదివరకే చూడగలిగాం. భారీపరిశ్రమలను అభివృద్ధి చేయడం ఇండియాను పూర్తిగా పారిశ్రామికంగాచేసి తత్ఫలితంగా వలసదేశ ఆర్థిక వ్యవస్థను రూపు మాపడం కాదు - (వలస ఆర్థిక విధానాన్ని సర్వనాశనం చేయనిదే భారత ప్రజానీకానికి మోక్షం లేదు) అమెరికా సామ్రాజ్యవాదులకు కావలసింది. "అమెరికా సహాయం అంటే లాభాల కోసం ఇండియాకు అమెరికా పెట్టుబడులను దిగుమతి చేయడమన్నమాట. అమెరికాయుద్ధ వ్యూహానికి - తగినట్లు ఇండియాను అభివృద్ధి చేయడం, అమెరికాకు కావలసిన ముడిసరకుల ఉత్పత్తిని అధికం చేయడం, ఈ ముడిపదార్థాలను తేలికగా, చౌకగా ఎగుమతి చేయడానికి అవసరమైన రవాణా సౌకర్యాలను అభివృద్ధి చేయడం - యిదే "అమెరికా సహాయాని"కి గల అర్థం.

ప్రపంచబ్యాంకునుండి నెహ్రూ ప్రభుత్వం తెస్తున్న "సహాయం"- పెద్దగా పొగడబడుతూన్న "సహాయం" యొక్క అసలుబండారం ఇదే. దీని ఫలితమేమంటే : పాతకాలపు వెనకబడ్డ వలస ఆర్థికవిధానమే! ఇండియా సంపదలను సామ్రాజ్యవాదులు పాతకాలంనుండి యథారీతిని దోపిడీ చేయడానికే

యీనాడు కొత్తగా "అమెరికా సహాయం" అని నామకరణం చేశారు.

ఈ రకమైన అమానుష "అమెరికా" పీడనను భారత శ్రామిక ప్రజాకోటిపై రుద్దడానికి అమెరికా బందిపోటుదొంగలు తమ దేశంలోని కార్మికవర్గంపైనా, ప్రజలపైనా ఎలాంటి ఫాసిస్టు మిలిటరీ పద్ధతులను వినియోగించారో - సరిగ్గా అలాంటివే ఇండియాలో కూడా ఉపయోగించుతారు. ఈరకమైన ఫాసిస్టు నిర్బంధ విధానాన్ని నెహ్రూ ప్రభుత్వం యిటీవల రైల్వేకార్మికుల సమ్మెను అణచడానికి అనుసరించిన సందర్భంలో అప్పుడే చూడగలిగాం. ఇటువంటి పరిస్థితులలో నెహ్రూగారి కమ్యూనిస్టు వ్యతిరేకత బ్రిటిష్ టోరీవర్గాల పత్రిక లండన్ టైమ్సు అభివందనాలను, మన్ననలను పొందిందంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. "టైమ్సు" పత్రిక నెహ్రూ వైఖరినిగురించి వ్రాస్తూ "ఆగ్నేయాసియాలోని యితర దేశాలకు మార్గదర్శిగా వున్నాడని" వ్యాఖ్యానించింది.

విపరీతమైన మిలిటరీ ఖర్చులు, జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలకు ఖర్చుపెట్టడం క్రమేణా పూర్తిగా తగ్గిపోవడం; - యిదీ మన ఇండియా అమెరికా యుద్ధ రథచక్రాలకు తగిలించబడినపక్షంలో ప్రజలకు లభించేఫలితం. నెహ్రూ ప్రభుత్వం మనకు ప్రాప్తించబోయే యీ ఫలితాన్ని తన యిటీవల బడ్జెట్టులో అప్పుడే రుచిచూపెట్టింది. ఆదాయంలో నూటికి 50 మిలిటరీ ఖర్చులకని బడ్జెట్టులో ప్రత్యేకించారు. మొన్న పార్లమెంటులో సమర్పించిన బడ్జెట్టులో దామాషాప్రకారం చూస్తే ప్రపంచమంతటిలోకి చెంగైషేక్ చైనా తరువాత ఇండియాయే ఎక్కువ ఆదాయాన్ని సాయుధబలాలపై వినియోగించేది!

దారుణమైన ఆర్థిక దోపిడీ, మిలిటరీ బీభత్సం - యివీ - ఇండియాను ఆంగ్లో-అమెరికన్ కూటమికి అంటకట్టడానికి నెహ్రూ ప్రభుత్వానికి అవకాశాన్నిచ్చిన పక్షంలో భారత ప్రజాకోటికి ప్రాప్తించేది.

ఇక ఆ పరిస్థితులలో భారత ప్రజానీకం సామ్రాజ్యవాదులకు అమ్మబడిన బానిససైనికుల్లా సోషలిస్టు సోవియట్ యూనియన్‌కూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలకూ, నూతన ప్రజాతంత్ర చైనాకూ, వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు సాగించే యుద్ధంలో అతి దారుణంగా త్రోయబడతారు.

ఈ విషయాన్ని గురించి ప్రఖ్యాత, వాల్‌స్ట్రీట్ ధనిక వర్గాలకు అతి సన్నిహితంగా వుండే పత్రికా రచయిత వాల్టర్ లిప్‌మాన్ అప్పుడే జోస్యం చెప్పివేశాడు. "హెరాల్డు ట్రిబ్యూన్"లో రాస్తూ వాల్టర్ లిప్‌మాన్ అమెరికా బ్రిటన్‌లు మధ్యప్రాచ్యంలో ఇండియాతో సంప్రతించకుండా తమ మిలిటరీపాలసీని నిర్ణయించుకోరాదని తెలిపాడు. ఎందుకనగా:

"ఇండియాకున్న మనుష్యసంపత్తినీ, యితర భౌతిక సంపదనూ.. గుర్తించ

వలసి ఉంది...గత యుద్ధంలో ఇండియా సాయం లేకుండా వుంటే బ్రిటన్ పరిస్థితి గడ్డుగా ఉండేది. మరో యుద్ధంలో కూడా వారి మనుష్య శక్తి సంపద చాల బలహీనం గాబట్టి అమెరికా, బ్రిటన్ల స్థితి యింకా అధ్వాన్నంగా వుంటుంది.”

వాల్‌స్ట్రీట్ ధనిక వర్గాల లాభాలను రక్షించేందుకు మనం సమిధల్లాగే వినియోగపడే అతి భయంకరమైన భవిష్యత్తు - ఇదే నేడు డాలర్ సామ్రాజ్యవాదులు తమ అట్లాంటిక్, పసిఫిక్ ఒడంబడికల క్రింద భారత శ్రామిక ప్రజాకోటికి అతి గర్వంగా ప్రసాదించే బహుమతి !

భారత పిల్ల సామ్రాజ్యవాదులు తాతా, బిర్లాల సంకుచిత వర్గ ప్రయోజనాల కోసం ఇండియాను ఇంగ్లో - అమెరికన్ యుద్ధకూటమికి అంటకట్టి వేయడానికి నెహ్రూ-పటేళ్ళ ప్రభుత్వం అనుసరించుతున్న పాలసీ మన ప్రజలకూ, మన దేశానికీ యీ రకమైన ప్రమాదకరమైన ఫలితాలను తెచ్చిపెడుతున్నది.

## VIII

కాని ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల యుద్ధ రథచక్రాలకు ముడిపెట్టుకొన్న పిల్లసామ్రాజ్యవాదులు అసలు సైన్యంలేకుండా అంచనా వేసుకొంటున్నారు.

● జయప్రదంగా పురోగమించుతున్న చైనా విముక్తిసైన్యం నాయకత్వాన ప్రజ్వరిల్లుతున్న ఆగ్నేయాసియాలోని ప్రజా విప్లవ శక్తులను గమనించకుండా అంచనాలు వేసుకొంటున్నారు.

● యూరప్‌లో శక్తివంతమైన ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలనూ, ఫ్రాన్సు, ఇటలీ, బ్రిటన్, అమెరికా, జపాన్ మొదలుగాగల పెట్టుబడిదారీ దేశాలలోని మహత్తరమైన కార్మిక వర్గ, ప్రజాతంత్రశక్తులను లెక్కలో కట్టుకోకుండా ప్లానులను వేస్తున్నారు.

● అన్నిటికంటే ముఖ్యంగా బలవత్తరమైన సోషలిస్టు సోవియట్ యూనియన్‌ను- వీళ్ళందరూ కలసి ఎంత బలంగలవారో అంతకంటే బలవత్తరమైన హిట్లర్‌ను సమాధికట్టి నేడు అజేయమైన కమ్యూనిజంవైపుకు పురోగమించుతున్న సోవియట్ యూనియన్‌ను గమనించకుండా యీ పిల్ల సామ్రాజ్యవాదులు అంచనాలు వేస్తున్నారు,

అసలు, సోవియట్ రాజ్యం, రోజురోజుకు వృద్ధి అవుతున్న దాని శక్తిసంపదా, దాని అంతర్జాతీయ ప్రతిష్ఠా, ఇతర దేశాలలో దానికిగల కార్మికవర్గశక్తుల ప్రజాతంత్ర శక్తుల మహత్తరమైన అండా, యివన్నీ ఉండగా ఏ కొత్తహిట్లరూ ప్రపంచాధిపత్యానికి ఎన్నిప్లానులు వేసినప్పటికీ అది అసాధ్యమైన విషయంగా ఎంచవలసివుంది.

అన్ని దేశాలలోవున్న కార్మికవర్గమూ, శ్రామిక ప్రజానీకమూ ఏదో “అధికారం కోసం పెనుగులాడుతున్న రెండుకూటాలు” అని సామ్రాజ్యవాదులు ప్రచారం చేస్తున్నట్టు కథకు ఇంకెంతమాత్రమూ మోసపోయేస్థితిలో లేరు. తమ స్వంత అనుభవం ద్వారా నేవారు యీనాడు జరుగుతున్న పోరాటం “అధి

కారం కోసం పెనుగులాడుతున్న రెండు కూటాల" మధ్యకాదనీ, అది రెండు శిబిరాల మధ్య - సామ్రాజ్యవాదం, పతనం కాబోతున్న పెట్టుబడిదారీ విధానపు శిబిరమొకటి, రెండోది ప్రజాతంత్ర శిబిరం, పురోగమించుతున్న సోషలిజం, శాంతికి ఆలవాలమైన శిబిరం మరొకటనీ - యీ రెండింటి మధ్య పోరాటమనీ వారు గుర్తించుతున్నారు.

ప్రపంచంలోని అన్ని దేశాలలోని కార్మికవర్గమూ శ్రామిక ప్రజాకోటీ సోవియట్ యూనియన్ పాత్రను - ఒక సోషలిస్టు రాజ్యంగానూ; శాంతి ప్రజాతంత్ర; సోషలిజంల శిబిరానికి నాయకుడుగానూ; వలస ప్రజల జాతీయ విముక్తి ఉద్యమాలను బలపరచే మొనగాడుగానూ ప్రపంచ విప్లవంయొక్క కోటగానూ - సోవియట్ యూనియన్ యొక్క మహత్తరమైన పాత్రనుస్పష్టంగా చూడగలుగుతున్నారు.

## IX

అందుకనే అన్నిదేశాలలోని శ్రామిక ప్రజలూ తమ స్వదేశాలలో వేస్తున్న సామ్రాజ్యవాద యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగానూ, సోవియట్ యూనియన్‌కూ, సోషలిస్టు రాజ్యం యొక్క నాయకత్వాన ఏర్పడిన ప్రజాస్వామిక ప్రజాతంత్రం, సోషలిజం, శాంతీ, వివిధజాతులకూ స్వాతంత్ర్యప్రతిపత్తికి ప్రాతినిధ్యం వహించే శిబిరానికీ అనుకూలంగానూ, దృఢంగా సమీకరించబడుతున్నారు.

ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆజ్ఞ లందుకొని, భారత గుత్తపెట్టుబడిదారీ వర్గాల ప్రయోజనాల కోసం పని చేసే నెహ్రూ - పటేళ్ళ ప్రభుత్వం సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా, ప్రజాస్వామిక ప్రజాతంత్ర చైనాకు వ్యతిరేకంగా ఒక ఆర్థిక మిలిటరీ కేంద్రంగా ఇండియానుమార్చడానికి ప్రయత్నించుతున్నది. అంతే కాదు; నెహ్రూప్రభుత్వం బర్మా, మలయా, వియత్‌నామ్, ఇండోనీషియా, యింకా యితర దేశాల జాతీయ విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా కార్యకలాపాలను కొనసాగించేందుకు వీలుగా వుండేటట్లు ఇండియాను ఒకమిలిట కేంద్రంగా మార్చడానికి తయారవుతున్నది.

భారతదేశంలోని శ్రామిక ప్రజానీకం కార్మికవర్గం నాయకత్వాన, దాని అగ్రగామిదళమైన కమ్యూనిస్టుపార్టీ యీ ఘోరమైన కుట్రను సాగనివ్వరు. తమ దేశం ప్రయోజనాలను, శ్రామిక ప్రజాకోటినీ రక్తదాహంగల సామ్రాజ్యవాదులకు నెహ్రూ - పటేల్ ప్రభుత్వమూ, దాని పెట్టుబడిదారీ యజమానులూ అమ్మడాన్ని సహించరు; దానిని సాగనివ్వరు. ఆసియా ప్రజల విముక్తి ఉద్యమాల గొంతుకోయడానికి ఇండియాను ఒక సాధనంగా మార్చే నెహ్రూ - పటేల్ ప్రభుత్వపు ప్రతి ప్రయ

త్వాన్ని ప్రజలు ప్రతిఘటించి తీరుతారు, సోషలిస్టు భూమి, సోవియట్ యూనియన్‌కూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర చైనాకూ, వ్యతిరేకంగా సాగే సామ్రాజ్యవాద దురాక్రమణ యుద్ధానికి ఒక ఉపగ్రహ మిలిటరీ కేంద్రంగా ఇండియాను మార్చే నెహ్రూ - పటేల్ ప్రభుత్వపు ప్రతి ప్రయత్నాన్ని భారత శ్రామిక ప్రజాకోటీ, దాని అగ్రగామి కమ్యూనిస్టు పార్టీ ప్రతిఘటించి తీరుతుంది.

సామ్రాజ్యవాద - బూర్జువా-ఫ్యూడల్ కూటమికీ, పాతవలస దేశ ఆర్థిక విధానానికీ వ్యతిరేకంగా నిలబడి నిజమైన స్వాతంత్ర్యానికీ; ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ, సోషలిజానికీ తామే స్వయంగా పోరాడుతున్న భారత శ్రామిక ప్రజాకోటి అంతర్జాతీయ కార్మిక వర్గం నాయకత్వాన దాని, అగ్రగామి సోవియట్ యూనియన్ నాయకత్వానవున్న ప్రపంచ ప్రజల శిబిరానికి అండగా బాసటగా తప్పక సమీకరించ బడుతుంది. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకూ వారి యుద్ధ కుతంత్రాలకూ వ్యతిరేకంగా జరిగే పోరాటంలో పాల్గొంటుంది

—"కరెంట్ ఎఫైర్స్" నుండి

(17-3 49)

"పీడిత ప్రజలకు అంతర్జాతీయ చైతన్యం కల్గించేటప్పుడు నొక్కి చెప్పవలసిన విషయం ఇది: పీడిత దేశాలకు విడిపోయే హక్కుతో కూడిన స్వాతంత్ర్యం కావాలని పీడిత ప్రజలందరూ కోరాలని చెప్పాలి. విడిపోయే హక్కు లేకుండా అంతర్జాతీయతే వుండదు. అటువంటి సత్యప్రచారాన్ని చేయుటకు తయారు కానటువంటి "సోషలిస్టు లందనీ" సామ్రాజ్యవాదులుగాను, పచ్చిదొంగలుగానూ పరిగణించవచ్చు. సోషలిజం రాకపూర్వం ఈ కోర్కె నెరవేరాలంటే వెయ్యికి ఒక వంతు అవకాశ మున్నప్పటికీ అది న్యాయమైన కోర్కెయే..."

—స్టాలిన్

(లెనినిజం 63 పేజీ)

## ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలలో

# జాతుల సమస్యా 

#   పరిష్కారం

— పి. సెరెబ్ర్యాన్నికోవ్

రెండో ప్రపంచయుద్ధానికి పూర్వం మధ్యయూరప్ దేశాలూ ఆగ్నేయ యూరప్ దేశాలూ, జాతుల పరస్పర కలహాలకు తావలమైవుండేవి. ఆ దేశాలపై పెత్తనం చలాయిస్తోన్న బూర్జువా - ఫ్యూడల్ వర్గాలు తమ స్వార్థంకోసం బుద్ధిపూర్వకంగా వివిధ జాతులమధ్య తగాదాలను రెచ్చగొట్టేవి. బూర్జువా జాతీయ భావాలను నూరిపోస్తూ ఉండేవి. యుద్ధానికి పూర్వం తూర్పుయూరప్‌లో పెత్తనం చెలాయించే పరిపాలక వర్గాలు అల్పసంఖ్యాక జాతులను అణచివేయడం, జాతీయ దురహంకారాన్ని పురికొల్పడం, ఒక పాలసీగా పెట్టుకొనేవి. వివిధ జాతులకు చెందిన ప్రజలమధ్య అంతర్జాతీయ భావాలు నెలకొనకుండా ఆ నాటి పాలకవర్గాలు బూర్జువా జాతీయతను ఒక ఆయుధంగా ఉపయోగిస్తూ వుండేవి.

హంగేరిలో ఆనాడు ఫాసిస్టు డిక్టేటరుగా ఉన్న హార్తీ స్లోవేకియాలోని దక్షిణజిల్లాలను కాజేసే ఉద్దేశంతో జెకోస్లోవేకియాకు వ్యతిరేకంగా కుట్రలు పన్నాడు. జెక్కులపై, స్లోవక్కులపై హంగేరియన్లలో జాతిద్వేషం ప్రకోపింప చేయడానికి కొందరు ఏజెంట్లను కూడా నియోగించాడు. జెకోస్లోవేకియాకు వ్యతిరేకంగా సూడెటన్ జర్మన్లను ఫాసిస్టు జర్మనీ ఉపయోగించుకున్నట్టే హంగేరియన మైనారిటీని హార్తీ ఉపయోగించుకున్నాడు. స్లోవేకియాలో తన గూఢచారులను నియమించాడు. తన ఏజెంట్లద్వారా అనేక విచ్ఛిన్న చర్యలు సాగించాడు.

ఉత్తర ట్రాన్సిల్వేనియా (రుమేనియా) లోకూడా ఫాసిస్టు నియంత హార్తీ ఇదేపని

కొనసాగించాడు. రుమేనియన్లకు వ్యతిరేకంగా ట్రాన్‌సిల్వేనియాన్ హంగేరియన్లను రెచ్చగొట్టాడు. దీన్ని అవకాశంగా తీసుకొని రుమేనియా పెట్టుబడిదారులు హంగేరియన్లకు వ్యతిరేకంగా రుమేనియన్లను ఉసిగొల్పారు. ఇదేవిధంగా బల్గేరియాలోని ఆనాటి అధికార వర్గం డోబ్రూజా సమస్యను అవకాశంగా తీసుకొని రుమేనియన్లపై బల్గేరియన్లలో ద్వేషాన్ని కలిగించారు. ఇందుకు బదులుగా రుమేనియాపాలకవర్గాలు బల్గేరియన్లపై రుమేనియన్లలో జాతివైషమ్యాన్ని ప్రకోపింపజేసారు.

## విభజించి పాలించే సూత్రం

తూర్పు యూరప్ దేశాల్లో ఉండే ప్రభుత్వాలను తమ గుప్పెట్లో పెట్టుకొన్న ప్రధాన సామ్రాజ్యదేశాలు ఈ జాతివైషమ్యాన్ని ఇంకా తీవ్రతంచేస్తూ ఉండేవి. 'విభజించి పాలించు' అనే సూత్రాన్ని సామ్రాజ్యవాద దేశాలు తమ స్వార్థానికి చక్కగా ఉపయోగించుకున్నాయి. ఈ సూత్రం ద్వారా సామ్రాజ్యవాదులు ఒకేదెబ్బతో అనేక పిట్టలను కొట్టగలిగారు. వివిధ జాతులమధ్య ద్వేషాన్ని రగుల్కొల్పి ఆయాదేశాలను ఆర్థికంగా బలహీనంచేశారు. ఆర్థిక బలహీనతను అవకాశంగా తీసుకొని 'ఆర్థికసహాయం' అనే పేరుతో ఆ యా దేశాలకు అప్పులు పెట్టారు. ఈద్వారా ఆదేశాల ఆర్థికవిధానాన్ని తమ గుప్పెట్లో చిక్కించుకొని వాటి సహజ సంపత్తిని కొల్లగొట్టారు. పరిశ్రమలను మార్కెట్లనూ తమ చెప్పుచేతుల్లో ఉంచుకున్నారు. తమకు పనికిరాని ఆయుధసామగ్రిని అధిక ధరలకు ఆదేశాలకు అమ్మి, విపరీతమైన లాభాలు గడించారు.

పశ్చిమ సామ్రాజ్యవాదుల చేతుల్లో కీలుబొమ్మలుగా తయారైన తూర్పు యూరప్ దేశాల పాలక వర్గాలు తమ యజమానులు సాగించే దురాక్రమణ ప్లానులకూ, దాడులకూ అన్నింటికీ వంత పాడారు. "గ్రేటర్ రుమేనియా" 'గ్రేటర్ బల్గేరియా" 'గ్రేటర్ హంగేరీ' మొదలైన నినాదాలన్నీ సామ్రాజ్యవాదులకు దాసోహమన్న దాని ఫలితమే. ఇతర దేశాలను ఆక్రమించుకోవాలనే దురుద్దేశమే బల్గేరియా, రుమేనియా, హంగేరీ దేశాల అభివృద్ధి నిరోధకులకు ఫాసిస్టు హిట్లరుతో పొత్తు కలిపింది. హిట్లరుతో కలసి ఆదేశాలు సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధంలో దిగేటట్లు చేసింది.

యుద్ధంలో ఫాసిస్టు జర్మనీ ఓడిపోవడంతోపాటు, మధ్యయూరప్, ఆగ్నేయ యూరప్ దేశాలు బానిసత్వం నుంచే కాక మాతృభూముల స్వాతంత్ర్యాన్ని అమ్మివేసిన బూర్జువా - ఫ్యూడల్ వర్గాల దాస్యంనుంచి కూడా విముక్తి చెందాయి. ఆదేశాల్లో ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వాలేర్పడ్డాయి. ప్రజాస్వామికంగా జాతులసమస్యను పరిష్కరించడానికి తగిన అవకాశం లభించింది. సోవియట్ యూనియన్‌లో జాతులసమస్య ఎంత ఉత్తమంగా పరిష్కరించ బడిందో, వివిధ జాతుల మధ్య సంపూర్ణ సుహృద్భావమూ సమానత్వమూ, పరస్పర సహకారమూ నెలకొల్పడానికి ఏ విధానం అవలంబించబడిందో అదే విధానాన్ని ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలు అవలంబించాయి. సోవియట్ యూనియన్‌లో లెనిన్ స్టాలిన్‌లు అవలంబించిన జాతుల సమస్యా పరిష్కార విధానం ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాల ప్రజల్లో నూతనోత్సాహాన్ని కలిగించింది. వివిధజాతులకుచెందిన కార్మిక ప్రజల్లో అత్యంత సన్నిహిత సంబంధాలనూ, పరస్పర సహకార సుహృద్భావాలనూ నెలకొల్పింది. సోవియట్ యూనియన్ చూపిన మార్గాన్నే ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు నడిచాయి.

నిన్నమొన్నటిదాకా తీవ్రజాతిద్వేషాలతో నిండిఉన్న ఈ దేశాల్లో నేడు ఎంతటి సుహృద్భావం, సోదరత్వం నెలకొనిందో చూస్తే లెనిన్ - స్టాలిన్‌లు అవలంబించిన విధానం ఎంత ఉత్తమమైనదో బోధపడుతూంది. రుమేనియాలో అనేకమంది హంగేరియన్లూ (షుమారు 15 లక్షలు) బల్గేరియన్లు, గ్రీకులూ యుక్రేనిఅన్లూ, సెర్బులూ, అల్బేనియన్లూ, యూదులూ, వగైరా వివిధ జాతులకుచెందిన వారున్నారు. వీరంతా కలిసి మొత్తం రుమేనియా జనాభాలో నూటికి 15 వంతులు. బల్గేరియా జనాభాలో నూటికి 17 మంది మైనారిటీ జాతుల ప్రజలు. బల్గేరియాలోని తూర్పు దక్షిణ, ఈశాన్య ప్రాంతాల్లో 6 లక్షల 50 వేల టర్కీజాతి వారున్నారు. అదేవిధంగా పిరిన్ జిల్లాలో మేసిడోనియన్లూ, డాన్యూబ్ ప్రాంతంలో రుమేనియన్లూ ఉన్నారు. జెకోస్లోవేకియాలో ప్రధాన జాతులైన జెక్కులూ స్లోవక్కులతోపాటు కొన్ని లక్షలమంది హంగేరియన్లు కూడా నివసిస్తున్నారు. ఇదేవిధంగా పోలండు, హంగేరీ, అల్బేనియా దేశాల్లో కూడా మైనారిటీ జాతులున్నాయి.

పైజెప్పిన దేశాల్లో ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వాలు ఏర్పడడంతో వివిధ జాతులమధ్య నిజమైన సఖ్యత్వం నెలకొల్పబడింది. తత్ఫలితంగా జాతివైషమ్యాలు నశించాయి. వివిధ జాతులమధ్య శాంతి సౌభ్రాతృత్వాలు సుస్థిరంగా పాదుకున్నాయి. జర్మనీ నుంచి మళ్ళీ నూతనంగా రాబోయే దాడికి ఈదేశాల ఐక్యతను మరింత గట్టిపరిచింది. ఈదేశాల పరస్పరం వర్తక, ఆర్థిక ఆది ఒడంబడికలు చేసుకున్నాయి.

రుమేనియా, హంగేరీ దేశాలమధ్య తగాదాలను రెచ్చగొట్టడానికి ఉత్తర ట్రాన్ సిల్వేనీయాను ఒక ప్రధానాయుధంగా సామ్రాజ్యవాదులు ఉపయోగిస్తూ ఉండేవారు. కాని ఇప్పుడు ఆ సామ్రాజ్యవాదుల ఆటకట్టింది. హిట్లరు 1940 లో తన బలప్రయోగంతో గుంజుకున్న ఈ ప్రాంతం తిరిగి రుమేనియాలో చేర్చబడింది. ఇది సముచితమైన, న్యాయసంగతమైన నిర్ణయమనీ, బాల్కన్ దేశాల్లో శాంతిభద్రతలకు ఈ నిర్ణయం పూర్తిగా తోడ్పడుతుందనీ హంగేరీ ప్రభుత్వంకూడా అంగీకరించింది. ఇదే విధంగా ఇదివరకు అనేక తగాదాలకు కారణభూతములైన సమస్యలన్నిటినీ ప్రజాస్వామికంగా నిర్ణయించడం జరిగిది. తత్ఫలితంగా పై దేశాలకు చెందిన వివిధజాతుల మధ్య పరస్పర విశ్వాసం, పరస్పర సౌభ్రాతృత్వం నెలకొన్నాయి. జాతుల సమస్యను ఈ విదేశాలు ఏ విధంగా పరిష్కరించాయో ఉదాహరణకు ఒక్క జెకోస్లోవేకియాను తీసుకుంటే చాలు; ఈ విషయం ఇంకా స్పష్టంగా బోధపడుతూంది.

రెండో ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత కొంతకాలం వరకు తాత్కాలికంగా జెకోస్లోవేకియాలో స్లోవక్ హంగేరియన్ల రాజకీయ హక్కులను కొంత పరిమితం చేయవలసి వచ్చింది. ఫాసిస్టు నియంతలైన హిట్లరు, హార్తీల సైన్యాలు జెకోస్లోవేకియాలో ప్రవేశించడానికి వీరుకూడా కొంతవరకు తోడ్పడమే ఇందుకు ప్రధానకారణం. హంగేరిలో ప్రజాస్వామిక ప్రజాతంత్రం పూర్తిగా ఏర్పడి, ఆదేశంలో ప్రధానమైన సాంఘిక ఆర్థిక మార్పులు జరిగిన మీదట స్లోవేకియాలో ఉన్న హంగేరియన్లపైకూడా ఆ ప్రభావం పూర్తిగా పడింది. స్లోవక్ హంగేరియన్లు కూడా తమ సోదరులైన జెక్, స్లోవక్ ప్రజలతో కలిసి జెకోస్లోవేకియా అభివృద్ధికి తోడ్పడ్డారు. తత్ఫలితంగా ఆ యా జాతుల మధ్యనున్న వైషమ్యాలు నశించాయి. ప్రజాస్వామిక జెకోస్లోవేకియా నేడు స్లోవక్

హంగేరియన్లు తమ నిజమైన మాతృభూమిగా భావిస్తున్నారు.

ఇరుగు పొరుగు దేశాల్లో నివసించే హంగేరియన్లు దురాక్రమణ పరుల చేతుల్లో కీలుబొమ్మల్లాగా ఉపయోగ పడడం హంగేరీ కార్మిక వర్గానికి ఏమాత్రం శ్రేయస్కరం కాదు. అది హంగేరీ పూర్వపు నిరంకుశాధి వర్గాల స్వార్థానికే తోడ్పడుతుంది. నేడు ఆ నిరంకుశాధికార వర్గాలు చరిత్రలో రూపు మాసిపోయ్యాయి. దురాక్రమణ విధానానికి ప్రజాస్వామిక ప్రజాతంత్రమే పూర్తిగావిరుద్ధమైనది. సోషలిస్టు సమాజం వైపు పురోగమించడమే నేటి జకోస్లోవేకియా, హంగేరీ దేశాల సమిష్టి ఆశయం. సోవియట్ యూనియన్ ఆధ్వర్యాన నూతనయుద్ధ ప్రేరేపకులకు వ్యతిరేకంగా శాంతి ప్రజాస్వామ్యాల కోసం పోరాటం సాగించడమే ఆ రెంటి దేశాల యొక్క ప్రధానాశయం. ఈ విధంగా ఆ రెండుదేశాలమధ్య పరస్పర కలహాలకు కారణ భూతములైన పునాదులనే పెకలించివేయడం జరిగింది. అల్పసంఖ్యాకులైన హంగేరియన్లకు జెకోస్లోవేకియా ప్రభుత్వం సమాన రాజకీయార్థిక హక్కులన్నిటిని కల్పించింది. స్లోవిక్ హంగేరియన్లు స్వేచ్ఛగా తమ జాతీయాభివృద్ధికీ, సాంస్కృతికాభి వృద్ధికీ పాటు పడడానికి సంపూర్ణఅవకాశాలను కలిగించింది.

* * *

ఇతరజాతులను అణచివేసే ఏజాతీ స్వతంత్రంగా ఉండజాలదు అనే లెనిన్ స్టాలిన్ల సూత్రంపై ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు తమ జాతీయ విధానాన్నికొనసాగిస్తున్నాయి. రుమేనియా వర్కర్స్ పార్టీ నాయకత్వం జాతుల సమస్యపై ఇటీవల ఈ క్రింది విధంగా తీర్మానించింది.

"జాతులమధ్య పరస్పర సౌభ్రాతృత్వం, కార్మిక ప్రజల మధ్య అంతర్జాతీయైక్యత అనే ఆశయాలతో ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాల్లో వివిధ జాతులకు చెందినకార్మికప్రజల సమిష్టి కృషిద్వారా మాత్రమే ఈ దేశాలు స్వతంత్రంగా సురక్షితంగా ఉండగలవు. సోషలిజంవైపు పురోగమించ గలవు.

వివిధజాతులకు చెందిన ప్రజలందరికీ ప్రజాతంత్రదేశాల్లో సమాన పౌరహక్కులూ ప్రజాస్వామిక రాజకీయహక్కులూ గ్యారంటీ చేయబడ్డాయి. ఉదాహరణకు బల్గేరియారాజ్యాంగ చట్టంయొక్క 71 నిబంధనలో ఇలాఉంది :-

"న్యాయశాస్త్రరీత్యా బల్గేరియాలో ఉన్న ప్రజలందరూ సమానులే. జాతులు, కులాలు, మతాలు, ఆస్తిపాస్తుల ఆధారంపై ఎవరికీ ఎట్టి ప్రత్యేకాధికారాలు ఉండవు. వివిధ జాతులమధ్య పరస్పర జాతిమతద్వేషాలు రెచ్చగొట్టడం చట్టరీత్యా శిక్షార్హం అవుతుంది."

ఇతర ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాల రాజ్యాంగ చట్టాల్లో కూడా ఇలాంటి నిబంధనలే ఉన్నాయి. చట్టరీత్యా నిబంధనలు చేసినంత మాత్రానే ఆదేశాలు సంతృప్తి పడలేదు. అల్ప సంఖ్యాకజాతులు తమ హక్కుల నుపయోగించుకోడానికి అవసరమైన భౌతిక పరిస్థితులను కూడా కల్పించాయి.

## రుమేనియాలో

నూతన రుమేనియాలోని ఉత్తర ట్రాన్సైల్వేనియన్ హంగేరియన్లకు ప్రజాస్వామిక హక్కులన్నీ ఉన్నాయి. రుమేనియాలో అమలు పరచిన వ్యవసాయ సంస్కరణల ఫలితంగా 42 వేల పేద హంగేరీ రైతులకు భూమి లభించింది. ప్రత్యేకంగా హంగేరియన్లకోసం 2 వేల ప్రాథమిక పాఠశాలలూ, 250 మాధ్యమిక పాఠశాలలూ, ఇంకా అనేక కళాశాలలూ

నెలకొల్పబడ్డాయి. హంగేరీభాషలో నేడు 15 వార్తాపత్రికలూ 25 వార, మాసపత్రికలూ ప్రచురించ బడుతున్నాయి. ఒక ఒపేరా థియేటరుతో సహా అల్పసంఖ్యాకులైన హంగేరియన్లకు నాలుగు నాట్యకళా మందిరాలుకూడా ఉన్నాయి.

ఆ యా స్థానిక ప్రభుత్వస్థానాల్లో, కోర్టుల్లో హంగేరియే ప్రధాన భాషగా ఉంది. రుమేనియా అసెంబ్లీలో 30 మంది హంగేరీ ప్రతినిధులున్నారు. స్థానిక ప్రభుత్వం హంగేరియన్ల ఆధ్వర్యానే నడుస్తూ ఉంది.

ఉత్తర ట్రాన్స్ సెల్వేనియాలోని కష్టజీవులైన రైతాంగం యొక్క వ్యవసాయాభివృద్ధికి రుమేనియా ప్రభుత్వం పూర్తిగా తోడ్పడింది. ఆ ప్రాంతంలో ట్రాక్టర్ నిర్మాణ పరిశ్రమలను నెలకొల్పింది. ఆ ప్రాంతమంతటా నేడు సస్యలక్ష్మి తాండవిస్తూ ఉంది.

రుమేనియాలో ఉన్న హంగేరియన్లకు హంగేరియన్ పీపుల్స్ యూనియన్ అనే ఒకరాజకీయసంఘం కూడా ఉంది. ఈ యూనియన్ 'అల్ రుమేనియన్ పీపుల్స్ డిమాక్రటిక్ ఫ్రంటు'కు అనుబంధ శాఖగా పనిచేస్తూఉంది. రుమేనియాలో సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికిగాను ఈ అనుబంధ శాఖలన్నీ ప్రధాన మాతృసంస్థతో కలిసి భుజం భుజం కలిపికృషి చేస్తున్నాయి.

రుమేనియాలోఉన్న తదితర అల్పసంఖ్యాక జాతులకు చెందిన బల్గేరియన్లూ గ్రీకులూ, సెర్బులు అల్బేనియన్లూ, యూదులూ వగైరా అందరికీ సమాన రాజకీయ హక్కులున్నాయి. ఈ హక్కులను సంరక్షించేందుకు మంత్రివర్గంలో మైనారిటీ జాతుల శాఖకు ఒక ప్రత్యేకమంత్రి కూడా ఉన్నాడు.

## బల్గేరియాలో

ఇదే విధంగా బల్గేరియాలో టర్కీ జాతివారు సమాన హక్కులతో స్వతంత్ర పౌరులుగా వ్యవహరిస్తూ ఉన్నారు. ఇదివరకప్పుడో టర్కీ ఫ్యూడల్ వర్గాలు బల్గేరియన్లను అణచివేసినందుకు బదులుగా జాతి దురహంకారులైన కొందరు బల్గేరియన్లుఅమాయికటర్కీప్రజలపై పగసాధిస్తూ ఉండేవారు. కాని బల్గేరియాలో ప్రజాస్వామిక ప్రజాతంత్రం నెలకొన్న తర్వాత టర్కీప్రజలకు కూడా బల్గేరియన్లతో పాటు సమానంగా ప్రజాస్వామిక హక్కులివ్వడం జరిగింది.

ఇంతకు పూర్వం బల్గేరియాలో ఉండే టర్కులకు ఒక్కస్కూలు కూడా ఉండేది కాదు. కాని నేడు టర్కులకు ప్రత్యేకంగా 1140 స్కూళ్లున్నాయి. వీటిలో 80 వేలమంది విద్యార్థులు చదువుతున్నారు. బల్గేరియాలో అమలు పరచిన వ్యవసాయ సంస్కరణల ఫలితంగా 25 వేలమంది టర్కీ రైతులకు భూమి లభించింది. ఆ యా స్థానిక కమిటీల్లో టర్కీవారే ప్రధానపదవులను నిర్వహిస్తూ ఉన్నారు. బల్గేరియా శాసనసభలో 7 గురు టర్కీ ప్రతినిధులుకూడా ఉన్నారు. టర్కీజాతివారు అధిక సంఖ్యాలుగా ఉన్న ప్రదేశాల్లో నేడు పరిశ్రమలు త్వరితంగా అభివృద్ధి చెందుతున్నాయి. వ్యవసాయాభివృద్ధికి కావలసిన నీటిపారుదల సౌకర్యాలు సమకూర్చబడినాయి. టర్కీజాతికి చెందిన లక్షల కొలది ప్రజలు నేడు ట్రేడ్ యూనియన్ సభ్యులుగా ఉన్నారు.

## జెకోస్లోవేకియాలో

జెకోస్లోవేకియాలో కూడా ప్రజాస్వామిక పద్ధతులపై జాతుల సమస్యను పరిష్కరించడం

జరిగింది. జెక్కులూ స్లోవక్కుల మధ్య ఎంత కాలం నుంచో వస్తూఉన్న జాతి వైషమ్యాలు అభివృద్ధి నిరోధకుల ఓటమితో నేడు మటుమాయమై పోయాయి. ఉభయుల మధ్య నేడు సోదరభావం పెంపొందింది. ఉభయులూ చేయీ చేయి కలిపి సోషలిజం వైపు పురోగమిస్తున్నారు. జెకోస్లోవేకియా రాజ్యాంగ రాజ్యాంగ చట్టంలో స్లోవక్కులకు విశాలమైన ప్రాంతీయ స్వాతంత్ర్యం ఇవ్వబడింది. తమ ప్రాంతానికి సంబంధించి వరకు స్లోవక్కులకు శాసనాధికారం కూడా ఉంది. జెకోస్లోవేకియా శాసనసభలో స్లోవక్కులకు కూడా సరి సమాన ప్రాతినిధ్యం ఇవ్వబడింది. స్లోవక్కుల జాతీయ సాంస్కృతికాభివృద్ధికీ, పారిశ్రామికాభివృద్ధికీ జెక్కులు విశేషంగా తోడ్పడుతున్నారు. జెకియా, మొరేవియా, ప్రదేశాలనుంచి 200 కర్మాగారాలు స్లోవేకియాకు మార్చబడ్డాయి. స్లోవేకియా శ్రామికుల సంఖ్య యుద్ధానికి పూర్వంకంటే నేడు రెట్టింపు అయింది. వ్యవసాయిక ప్రదేశంగా ఉన్న స్లోవేకియా జెక్కుల సహకారంతో నేడొక పారిశ్రామిక ప్రదేశంగామారిపోయింది.

ప్రజాతంత్ర పద్ధతులపై జాతుల సమస్యను పరిష్కరించడంలో ఆదేశాల కమ్యూనిస్టుపార్టీలు అత్యంత ప్రధాన పాత్రను నిర్వహించాయి. వివిధజాతుల మధ్య శ్రామిక వర్గ అంతర్జాతీయతను గాఢంగా పాదుకొల్పాయి. శాంతికోసం, ప్రజాస్వామికం కోసం, సోషలిజంకోసం జరిగే పోరాటంలో సోవియట్ యూనియన్ ఎంతటి మహత్తర పాత్ర నిర్వహిస్తూ ఉందో గుర్తింపచేశాయి. లెనిన్ స్టాలిన్‌లు చూపిన బాట ననుసరించి ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాల ప్రజలు అతి శీఘ్రంగా ముందుకు సాగిపోతూ ఉన్నారు.

ఈ యుద్ధానంతర కాలంలో సిద్ధాంత రీత్యా హిట్లరుకు వారసులైన అమెరికా సామ్రాజ్యవాదులు ప్రపంచాధిపత్యంకోసం కలలు గంటున్నారు. హిట్లరు అడుగుజాడల్లో నడుస్తున్నారు. ఇతర జాతులన్నిటికంటె ఆంగ్లో సాక్సనులు గొప్పవారని జాత్యహంకార భావాలను ప్రచారం చేస్తున్నారు. ఇందుకు వారు బూర్జువా కాస్మాపొలిటు నిజాన్ని, దీనికి ప్రతిరూపమైన బూర్జువా జాతీయతను ప్రధానాయుధంగా ఉపయోగిస్తున్నారు. ఈ కాస్మాపొలిటనిజం ద్వారా జాతీయచైతన్యాన్ని నాశనంచేసి అమెరికా సామ్రాజ్యవాదుల విస్తరణాకాంక్షకు బలి చేయ జూస్తున్నారు. ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలకు వ్యతిరేకంగా ఆదేశాల్లో అంతఃకలహాలను రెచ్చగొట్టే నిమిత్తం వాల్‌స్ట్రీటు గుత్తపెట్టుబడిదారులు, వాళ్ళ ఏజెంట్లూ బూర్జువా జాతీయతను బాగా పురికొల్పుతున్నారు. బూర్జువా జాతీయతద్వారా సోవియట్ యూనియన్‌పై ద్వేషాన్ని రగుల్కొల్పాలని ప్రయత్నిస్తున్నారు.

యుగోస్లావియాలో నేడు టిటో ముఠా చేస్తూన్న పని ఇదే. శ్రామికవర్గ అంతర్జాతీయతా సిద్ధాంతానికి టిటో ముఠా స్వస్తి చెప్పింది. ఇరుగు పొరుగు దేశాల్లో ఉన్న జాతులపై సోవియట్ యూనియన్‌పై జాతి ద్వేషాన్ని రెచ్చగొడుతూ ఉంది. ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలతో సంబంధాలు తెగతెంపులు చేసుకొని సామ్రాజ్యవాదుల అడుగుల క్రింద శాశ్వతంగాపడి ఉండడం ద్వారా టిటో ముఠా తన అధికారాన్ని నిలబెట్టుకో జూస్తూ ఉంది. టిటో ముఠా సాగించే ఈ కుతంత్రాలన్నీ భగ్నమవుతాయనడంలో ఎట్టి సందేహంలేదు.

ప్రజాస్వామికప్రజాతంత్రదేశాల్లో జరిగిన జాతుల సమస్యాపరిష్కారం ప్రపంచశాంతికీ, అభ్యుదయానికీ ఎంతగానో తోడ్పడుతుంది.

'న్యూటైమ్సు' నుండి (23-3-49)

# ఇండోనీషియాలో జాతీయస్వాతంత్ర్యోద్యమం

—పి. డి. గ్రూట్

(డచ్ కమ్యూనిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి)

ఇండోనీషియా పెట్టుబడిదారులు జపాన్ ఆక్రమణ కాలంలో జపాన్ ప్రభుత్వానికి ఏజెంట్లుగా పనిచేశారు. డచ్ సామ్రాజ్యవాదులు ఇండోనీషియాలోని ఫ్యూడల్ వర్గాలపై ఎక్కువగా ఆధారపడేవారు. కాని జపాన్ సామ్రాజ్యవాదులు అట్లుగాకుండ పెట్టుబడిదారులను దువ్వి, తమ చేతిక్రిందకు రాబట్టుకున్నారు. ఇండోనీషియాలో బూర్జువావర్గ నాయకులైన సొకర్నో, హట్టాల ఆధ్వర్యం క్రింద ఒక 'జాతీయ కౌన్సిల్'ను స్థాపించారు.

యుద్ధంలో జపాన్ ఓడిపోయిన తర్వాత ప్రజల ఒత్తిడికి తట్టుకోలేక సొకర్నో, హట్టాలు ఇండోనీషియాను స్వతంత్రరిపబ్లిక్‌గా ప్రకటించారు. జాతీయకౌన్సిల్‌ను తమ అదుపాజ్ఞలో ఉంచుకొని తద్వారా ప్రజల పురోభివృద్ధిని అరికట్టడానికి ప్రయత్నించారు.

ఫ్యూడల్ వర్గాల అధికారమూ, దోపిడీ ఇప్పటిలాగే సాగిపోతున్నాయి. పూర్వం డచ్చి సామ్రాజ్యవాదులు నియోగించిన అధికారులే జపాన్ ప్రభుత్వ కాలంలోకూడా అధికారులుగా ఉన్నారు. ఆ అధికారులే జపాన్ ఓడిపోయిన తర్వాత మళ్ళ ప్రజల నెత్తిపైకెక్కి సవారీచేయ నారంభించారు. సోషలిస్టు పార్టీ ప్రధానపాత్ర వహించిన షరీర్, షరీపుద్దీన్‌ల ప్రభుత్వంలో కూడా రైతు-కూలీ ప్రజల బాధానివారణకు ఏట్టి ప్రయత్నం జరగలేదు. వ్యవసాయ సంస్కరణల జోలికే పోలేదు.

* * *

జపాన్ ఆక్రమణకాలంలో జపాన్‌కు వ్యతిరేకంగా ఒక్క కమ్యూనిస్టుపార్టీయే తీవ్రంగా పోరాడింది. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానే ఇండోనీషియాలో ప్రజాఉద్యమం అభివృద్ధి చెందింది.

1920 మే లో ఇండోనీషియా కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడింది. వెంటనే డచ్ సామ్రాజ్యవాదులు పార్టీని నిషేధించారు. పార్టీపై తీవ్రమైన నిర్బంధవిధానం అమలుజరిపారు. 1927 తిరుగుబాటు తదనంతరం వేలకొలది పార్టీసభ్యులను ఉరితీయడం, న్యూగినీలో ఉన్న

'ఒబెర్ - డిగుల్' కాన్సెంట్రేషన్ క్యాంపులో నిర్బంధించడం జరిగింది. డచ్ సామ్రాజ్యవాదుల అమానుష హింసాకాండకు గురికాకుండా అనాడు తప్పించుకున్న కొద్ది మందిలో కామ్రేడ్ మోసో ఒకడు. కామ్రేడ్ మోసో పోస్టు ఆఫీస్ వర్కర్స్ యూనియన్‌కు నాయకుడు. ఇండోనీషియా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యుడు.

అనాడు ఛిన్నాభిన్నమైపోయిన కమ్యూనిస్టుపార్టీ శక్తులన్నిటినీ మరల సంఘటితంచేసి కామ్రేడ్ మోసో 1936 లో ఒక చిన్న కమ్యూనిస్టుగ్రూపును ఏర్పరిచాడు. ఈచిన్న గ్రూపే క్రమక్రమంగా అభివృద్ధిచెంది ద్వితీయ ప్రపంచయుద్ధ ప్రారంభసమయానికి ట్రేడ్ యూనియన్లద్వారా, తదితర ప్రజాసంఘాల ద్వారా ప్రజల్లో తగినంత పలుకుబడి సంపాదించింది.

జపాన్ ఓటమి తర్వాత వివిధ వర్గాలకు చెందిన ప్రజలందరితో ఒక ఐక్యసంఘటన నిర్మించబడింది. బహిరంగంగా పనిచేసేందుకు కమ్యూనిస్టుపార్టీకి అవకాశం లభించింది. కాని, ఆ సమయంలో ఒక పార్టీగా బహిరంగంగా ముందుకువచ్చి పనిచేయకపోవడమే ఆనాటి కమ్యూనిస్టుల కృషిలోఉన్న బలహీనత. అంతక్రితం వరకూ అవలంబిస్తూవచ్చిన అజ్ఞాతవాసపు పెత్తుగడలే వారిలో యింకా మిగిలిపోయాయి. బహిరంగావకాశాలు లభించిన సమయంలోకూడా రహస్యయంత్రంపైనే వారు ఎక్కువగా ఆధారపడ్డారు. తమ శక్తులన్నిటినీ కేంద్రీకరించుకోలేదు. పైగా వారొక సోషలిస్టుపార్టీని స్థాపించి దాని నాయకత్వం లెవిన్‌కు ఏజంటుగా పనిచేసే షరీర్ లాంటి వాళ్ళకు కట్టబెట్టారు. "వర్కర్సు పార్టీ"లో మాత్రం వారు ప్రధానపాత్ర వహించి పని చేశారు. ఆ పార్టీలో జపాన్ ఏజెంట్లు దూరముండా జాగ్రత్త వహించారు.

కమ్యూనిస్టుపార్టీ కొన్ని లోపాలు చేసినప్పటికీ మొత్తంమీద ప్రజల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొన్నది. లెనిన్ స్టాలిన్‌ల సిద్ధాంతాల ఆధారంపై తన లోపాలను దిద్దుకున్న తర్వాత గత వేసంగిలోనూ, హేమంతంలోనూ కమ్యూనిస్టుపార్టీ అనేక ఘనవిజయాలు సాధించింది.

ట్రేడ్‌యూనియన్లలోనూ, కిసాన్ సభల్లోనూ పనిచేసే వివిధ కార్మికపార్టీలూ, అతివాదపక్షానికి చెందిన సోషలిస్టు యువజన సంఘమూ కమ్యూనిస్టుపార్టీలో కలసిపోయాయి.

గతంలో చేసిన లోపాలను బహిరంగంగా అంగీకరించడంతోపాటు ప్రజా ప్రాతిపదికను ఇంకా విస్తృతం చేయుటకు తీసుకొన్న నిర్ణయంఫలితంగా జాతీయవిముక్తి ఉద్యమం విరివిగా విజృంభించింది. కార్మికప్రజలు ఈ ఉద్యమానికి పూర్తిగా అండగా నిలబడ్డారు.

సామ్రాజ్యవాదుల సైన్యాలనుంచీ పలుకుబడినుంచీ, దేశాన్ని విముక్తి చేయాలనీ, బ్రహాండమయిన జాతీయ సంఘటన నిర్మించాలనీ పార్టీ పిలుపు ఇచ్చింది.

ప్రభుత్వ స్థానికశాఖలన్నిటినీ వెంటనే ప్రజాస్వామికం చేయాలనీ, సామ్రాజ్యవాద భూస్వాములనుంచి స్వాధీనపరుచుకున్న భూములను వ్యవసాయ కమ్యూనిటీలకు ఇవ్వాలనీ, (జావాలో ఉన్న నీటిపారుదల సౌకర్యాలనుబట్టి వ్యవసాయంచేసే కమ్యూనిటీలకే భూములిచ్చి సమిష్టి వ్యవసాయాన్ని కొనసాగించడం అవసరం) కమ్యూనిస్టుపార్టీ హట్టా ప్రభుత్వాల్ని డిమాండ్ చేసింది. అమెరికన్, డచ్ సామ్రాజ్యవాదులకు హట్టా లొంగిపోరాదని పట్టుబట్టింది. బూర్జువా, ఫ్యూడల్ వర్గాలపై ఆధారపడిన హట్టా ప్రభుత్వాన్ని తొలగించి అస్థానంలో నిజమైన ప్రజాప్రభు

త్వాన్ని నెలకొల్పడం, స్వాతంత్ర్య పోరాటాన్ని దిగ్విజయంగా కొనసాగించడం తన ఆశయమని కమ్యూనిస్టుపార్టీ ప్రకటించింది.

ఇండోనీషియా ప్రజాసామాన్యంలో సోవియట్ యూనియన్‌పట్ల గాఢమైన సానుభూతి ఏర్పడింది. సోవియట్‌లో ఇండోనీషియాలో పరస్పరం రాయబారుల నియామకం జరగాలని క్రిందటి జూన్ నెలలో ప్రేగ్ నగరంలో ఒక ఒడంబడికకూడా కుదిరింది. కాని ఈ ఒడంబడికను గుర్తించడంలో సాధ్యమైనంత విలంబన చేయడానికి హట్టా ప్రభుత్వం ప్రయత్నించింది. కాని ఇండోనీషియాలోని వివిధ రాజకీయ పార్టీలన్నీ - నేషనల్ పార్టీ (హట్టాపార్టీ) తో సహా - ఒడంబడికను బలపరచాలని పట్టుబట్టాయి.

మిత్రరాజ్య భద్రతాసమితి సమావేశంలో ఇండోనీషియా సమస్యను కదిలించిందీ, ఇండోనీషియా స్వాతంత్ర ప్రతిపత్తి గురించి తీవ్రంగా పోరాడిందీ సోవియట్ యూక్రేయిన్ ప్రతినిధి అయిన కామ్రేడ్ మాన్యుయిల్‌స్కీ అనే విషయాన్ని ఇండోనీషియా ప్రజలు మరచిపోలేదు. మరచిపోరు.

* * *

జాతీయ విముక్తిపోరాటానికి నాయకత్వం వహించి కమ్యూనిస్టుపార్టీ సాగించిన తీవ్ర కృషి ఫలితంగా ప్రజాసామాన్యంలో ఒక నూతన విప్లవచైతన్యం రేకెత్తింది.

ఇండోనీషియాలో కమ్యూనిస్టు పార్టీ నానాటికి బలపడుతూ ఉండడం అమెరికా, బ్రిటిష్, డచ్ సామ్రాజ్యవాదులకు కంటకంగా వుంది. ప్రజలపై ప్రయోగించడానికి సామ్రాజ్యవాదుల ఆయుధాగారంలో ఎల్లప్పుడూ సిద్ధంగావుండే ఆయుధాలు - నిర్బంధాలు, హత్యలు, తుపాకు ట్రాట్స్కీ ముఠా విచ్ఛిన్న ఎత్తుగడలు - ఉపయోగించబడ్డాయి.

హట్టా ప్రభుత్వంపై అమెరికా కుబేరులకు సర్వాధిపత్యం ఏర్పడింది. అనేక పరిశ్రమలూ, రబ్బరుతోటలూ అమెరికా పెట్టుబడిదారుల హస్తగతమయ్యాయి. జంబి నూనెపరిశ్రమంలో (సెంట్రల్ సుమత్రా) నూటికి 50 వంతుల పైగా పెట్టుబడి అమెరికా చేతుల్లోనే వుంది. హట్టా ప్రభుత్వం అమెరికన్ బ్యాంకరు అయిన ఫాక్సుతో 1948 జూలై 2 వ తేదీన చేసుకున్న ఒడంబడిక ప్రకారం ఇండోనీషియా విదేశవ్యాపారం అంతా అమెరికాకు ధారాదత్తం చేయబడింది.

ఇదేవిధంగా ఫ్రాక్సుకు హట్టా ప్రభుత్వం ఆర్థికదోపిడీకి అవసరమైన అనేక సదుపాయాలు కలిగించింది. అమెరికన్, బ్రిటిషు ఆర్థిక, సైనిక 'సలహాదారులు' జోగాకర్తా వచ్చి తిష్టవేశారు.

భద్రతాసమితి పంపిన 'గుడ్ ఆఫీసెస్ కమిటీ'లోని అమెరికా ప్రతినిధులు హట్టా ప్రభుత్వానికి రాజకీయ సలహాదారులుగా తయారై ఆ ప్రభుత్వాన్ని తమ చేతుల్లో ఒక కీలుబొమ్మలాగా ఉపయోగించుకున్నారు.

క్రిందటి జూలై నెలలో జావాలోని సారంగన్ అనే ఒక గ్రామంలో జరిగిన రహస్యసమావేశానికి హట్టా, సొకరొన్లతోపాటు ఓగ్‌బర్న్ అనే 'గుడ్ ఆఫీసెస్ కమిటీ'లోని అమెరికా ప్రతినిధికూడా హాజరయ్యారు. ఇండోనీషియాలో కమ్యూనిజాన్ని పూర్తిగా నిర్మూలించి వేయాలని, అందుకవసరమైన ఆయుధాలను, సలహాదారులను అమెరికా సప్లయి చేస్తుందనీ హట్టా ప్రభుత్వాన్ని ఆదేశించాడు.

అమెరికా పెట్టుబడిదారుల అడుగులకు మడుగులొత్తే హట్టా సెంట్రల్ జావా (మాడియన్)లో కమ్యూనిస్టులు 'విప్లవం' ప్రారంభించారని దేశమంతటా వెంటనే నిర్బంధ చర్యలకు పూనుకున్నాడు. 25 వేల మంది పైగా అరెస్టు చేయబడ్డారు. అనేకమంది పార్టీ నాయకులను హత్యచేయడంకూడా జరిగింది.

హిట్లరు అడుగుజాడల్లో నడుస్తూవున్న అమెరికా సామ్రాజ్యవాదులు హట్టా ప్రభుత్వముచే కమ్యూనిస్టులను అణచివేయడం ద్వారా విప్లవోద్యమానికి నాయకత్వం లేకుండాచేసి దాన్ని విచ్ఛిన్నం చేయగలం అని భావించారు. జాతీయ విముక్తి వుద్యమాన్ని త్వరితంగా అణచివేయాలనే ఉద్దేశంతో హట్టాముఠా అసలు రిపబ్లిక్ నే దెబ్బకొట్టింది. డిసెంబరు 18వ తేదీన రిపబ్లిక్ పై డచ్ పేరాట్రూప్స్ దాడిచేసినప్పుడు హట్టా ప్రభుత్వం అసలు ప్రతిఘటించడమే మానివేసింది. ప్లానుప్రకారం' హట్టా ప్రభుత్వం డచ్ సామ్రాజ్యవాదులకు లొంగిపోయింది. కాని అంత మాత్రంతో డచ్ ప్రభుత్వం అనుకున్నట్లుగా దాని ఆటలు సాగలేదు. హట్టా ప్రభుత్వాధీనంలోఉన్న రెగ్యులర్ సైన్యంలో కొంత భాగం డచ్ సామ్రాజ్యవాదులకు లొంగిపోయింది. సైనికాధికారుల్లో కొందరు లొంగిపోయ్యారు. కాని 'లస్కర్లు' అనబడే సైనికులు మాత్రం అస్త్రసన్యాసానికి అంగీకరించలేదు. ఆయుధాలతోసహా కొండ ప్రదేశాలకు వెళ్ళి అక్కడనుంచే వారు ప్రతిఘుటన సాగిస్తున్నారు. గెరిల్లాలు ఎడతెరిపి లేకుండా డచ్చి సైన్యాలపై దాడులు చేస్తున్నారు.

సైనికబలం, ఆయుధబలం అమితంగా ఉండడంచేత తమకు గలిగిన తాత్కాలిక విజయాన్ని అవకాశంగా తీసుకొని డచ్ సామ్రాజ్యవాదులు మళ్ళీ దేశమంతటా పాత వలసదేశ విధానాన్ని నెలకొల్పుతున్నారు.

మాతృభూమికీ, తమ ప్రజలకూ తాము చేసిన ద్రోహానికి సంతోషించి డచ్ సామ్రాజ్యవాదులు ఏదో ప్రవ్వితలకత్తుతారని హట్టా, సోకిర్నోలు ఆశించారు. కాని పాపం వారి ఆశలు నిరాశలయ్యాయి.

డచ్ సామ్రాజ్యవాదులు హట్టా ముఠాను అరెస్టుచేసి వెంటనే రిపబ్లిక్ ను రద్దుచేశారు. తమ అధికారాన్ని శాశ్వతంగా నిలబెట్టుకోడానికి డచ్చి సామ్రాజ్యవాదులు కేవలం తమ సైనిక బలంమీదనే ఆధారపడుతున్నారు. తమ దోపిడిని నిరభ్యంతరంగా కొనసాగించుకోడానికే 'ఇండోనీషియన్ గవర్న మెంటు' అనే బూటకపు వాగ్దానం చేస్తున్నారు.

భద్రతాసమితిలో ఇటీవల జరిగిన చర్చల్లో, డచ్ దురాక్రమణను అమెరికా 'తీవ్రంగా ఖండించడం, చివరకు ఆచరణలోకి వచ్చేటప్పటికి ఇండోనీషియాలో డచ్ ప్రభుత్వం ఆక్రమించుకున్న ప్రదేశాన్ని డచ్ ప్రభుత్వం క్రిందనే ఉంచడానికి అంగీకరించడం అందరికీ తెలిసిన విషయమే.

భద్రతాసమితిలో డచ్ దురాక్రమణకు వ్యతిరేకంగా సోవియట్ ప్రతినిధి తుదివరకు పోరాడాడు. క్రొత్తగా ఆక్రమించుకున్న ప్రదేశాలను వదలి డచ్ సైన్యాలు వెనకటి స్థలాలకు తిరిగిపోవాలని సోవియట్ ప్రతినిధి ప్రతిపాదించాడు. తనకు భృత్యులైన సభ్యుల 'మెజారిటీ'తో సోవియట్ ప్రతిపాదనను నిరాకరించి అమెరికా తన తీర్మానాన్ని ప్యాస్ చేయించింది. అమెరికా తీర్మానాన్ని వలసదేశాల పీడిత ప్రజలేకాకుండా ప్రపంచంలోఉన్న అభ్యుదయ కాముకులందరూ నిరసించారు.

జాతీయవిముక్తి ఉద్యమంలో ఉన్న చీలిక ఫలితంగా ఇండోనీషియా ప్రజలు ఈకష్టనష్టాల నెదుర్కోవలసి వచ్చింది. ఈ చీలికకు అభివృద్ధినిరోధక ఫ్యూడల్ బూర్జువావర్గాలే కారకులు. ఫ్యూడల్ బూర్జువావర్గాలు తమ దేశాన్ని సామ్రాజ్యవాద దోపిడిగాండ్లకు అమ్మివేసినా ప్రజలుమాత్రం నిరుత్సాహ పడలేదు. ఓడిపోలేదు. కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన సంఘటితపడి తమ పోరాటాన్ని సాగిస్తూనే ఉన్నారు.

* * *

ఇండోనీషియాలో డచ్ సామ్రాజ్యవాదులు సాగించే వలసదేశ యుద్ధం కారణంగా హాలెండులో వర్గసంఘర్షణ ఇంకా తీవ్రతరమయింది. డచ్ సామ్రాజ్యవాదుల దురాక్రమణకు వ్యతిరేకంగా అసంఖ్యాక డచ్ ప్రజలు తమ అసమ్మతిని తెలియపరిచారు.

ఇండోనీషియాపై దాడి జరిగిన వెంటనే అనేక డచ్ ఫ్యాక్టరీల్లో కార్మికులు సమ్మెచేశారు. అసమ్మతి ప్రదర్శనాలు జరిపారు.

మితవాద సోషలిస్టులు తమ అసలు రంగులో బైటబడ్డారు. సామ్రాజ్యవాదులకు తాము నిజమైన ఏజెంట్లుగా మరోసారి రుజువు చేసుకున్నారు. వలసదేశాలపై యుద్ధాలు సాగించే సామ్రాజ్యవాదుల ప్రక్కజేరి, మితవాద సోషలిస్టులు వంతపాడుతున్నారు. అభివృద్ధినిరోధక వర్గానికి తామే స్వయంగా నాయకత్వం వహిస్తున్నారు.

సామ్రాజ్యవాదుల దాడికి వ్యతిరేకంగా వలసదేశ ప్రజలతో, కలిసి - ఇండోనీషియా ప్రజలతో కలసి - డచ్ కార్మికవర్గంయొక్క ఇండోనీషియా ప్రజాసామాన్యంయొక్క ఈ సమిష్టిపోరాటాన్ని డచ్ కమ్యూనిస్టు పార్టీ తుదవరకు సాగిస్తుంది. ఈ పోరాటాన్ని ఇంకా తీవ్రతరం చేస్తుంది.

"ఫర్ ఎ లాస్టింగ్ పీస్ ఫర్ ఏ పీపుల్స్ డిమోక్రసీ, (15-2-49) నుండి"



# భారత ప్రజల స్థానం శాంతి శిబిరంలోనే

## భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రకార్యాలయ ప్రకటన

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యాలయం
యీ క్రింది ప్రకటన చేసింది.

"ఆగ్నేయాసియాలో సామ్రాజ్య రక్షణ"కూ అట్లాంటిక్ ఒడంబడికకు అనుబంధంగా వుండే పసిఫిక్ సంధినీ చేసుకొనేందుకూ నేడు బ్రిటిషుమంత్రులు ఇండియాతోనూ, యింకా యితర దేశాలతోనూ కొనసాగించుతున్న రాయబారాలు 'తటస్థత' 'స్వతంత్ర విదేశాంగ విధానమూ' అనే ఇండియా ప్రభుత్వపు మునుగును కాస్తా తొలగించి వేసింది. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాక్రమణ యుద్ధ శిబిరంలోకి ఇండియాను క్రమక్రమంగా జేర్చివైచే ప్రయత్నాలను మరుగుపరచేందుకు మాత్రమే యీ నటనంతా చేయబడుతున్నదని తేలిపోయింది.

అట్లాంటిక్ ఒడంబడిక యుద్ధం కోసం చేసుకొన్న ఒడంబడిక. ఇది అమెరికా సామ్రాజ్యవాదం నాయకత్వాన ప్రపంచాధిపత్యం కోసం చేసుకొన్న ఒడంబడిక; సోషలిస్టు భూమికి వ్యతిరేకంగా యుద్ధం జరిపేందుకు చేసుకొన్న ఒడంబడిక.

ప్రపంచ మంతటా బ్రహ్మాండంగా ముందుకు పురోగమించుతున్న విప్లవ శక్తులను చూసి కంగారుపడి, పెట్టుబడిదారీ ప్రపంచాన్ని రోజు రోజుకూ ముంచుకొస్తున్న తీవ్రమైన ఆర్థిక సంక్షోభానికి భయపడి, డాలర్ సామ్రాజ్యవాదులు బహిరంగంగా మరొక నూతన ప్రపంచం యుద్ధాన్ని – కూలిపోతున్న తమ పెట్టుబడిదారీ వ్యవస్థను కాపాడు

కొని, ప్రతిఘటించ వీలు పడని సోషలిజం పురోగమనాన్ని అరికట్టడానికి – తమ ఆఖరి జూదంగా యుద్ధబాటను స్వీకరించారు. ఈ డాలర్ సామ్రాజ్యవాదుల వెనుక ప్రతిదేశంలోని పెట్టుబడిదారీ వర్గాలుచేరి తమదేశాలను అమెరికాకు వలసదేశాలుగానూ, మిలిటరీ వ్యూహ కేంద్రాలుగానూ, తమ ప్రజలను అమెరికా మారణ యుద్ధహోమంలో సమిధలుగానూ అమ్మడానికి సిద్ధపడుతున్నారు.

ఇదే అట్లాంటిక్ ఒడంబడిక అంతరార్థం. అంతేకాదు; దాని కనుబంధంగావుండే పసిఫిక్ సంధీ, మెడిటరేనియన్ ఒడంబడికా, ఆగ్నేయాసియా కూటమీ, యింకా యితర కూటాలూ ప్రపంచాన్నంతటినీ అమెరికా సామ్రాజ్యవాదులు ఆవరించడానికి సాధనాలు మాత్రమే.

ఇండియా ప్రభుత్వం బానిస బుద్ధితో యీ ఒడంబడికకు తన అమోదాన్ని తెలిపింది. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద యుద్ధోన్మాదుల పక్షాన బహిరంగంగా చేరింది. ఇదంతా గత సంవత్సరం లండన్‌లో జరిగిన కామన్ వెల్తు ప్రధానుల సమావేశంలో జరిగిన కుట్రయొక్క సహజ పర్యవసానం మాత్రమే.

## ఇండియా జీహుకుం పాత్ర

ఆ సమావేశంలో తిరిగి పునర్జీవం పొందుతున్న ఆసియాలోని మహత్తరమైన జాతీయ విముక్తి ఉద్యమాలను సర్వనాశనం చేయడానికి ఉద్దేశించబడిన వలసదేశాలుగల యూరోప్‌లోని రాజ్యాలన్నింటి యూనియన్ స్థాపననూ, అట్లాంటిక్ ఒడంబడిక స్థాపననూ, పశ్చిమ రాజ్యాల యూనియన్ నిర్మాణాన్ని ఇండియా బహిరంగంగా ఆశీర్వదించింది. ఈరకమైన వైఖరిని అవలంబించడంమూలంగా ఇండియా ప్రభుత్వం ఆగ్నేయాసియాలో సామ్రాజ్యవాదుల సైనికబంటుగా నిర్వహించే నీచమైన పాత్రను తీసుకోవడానికి పద్ధపడింది.

● ఈ విషయం ఇండోనీషియాపై ఆసియాసభ జరిగినప్పుడు మరింత స్పష్టంగా బయటపడింది. ఈ సభ ఇండోనీషియా ప్రజల వీరోచిత పోరాటానికి చిన్న మెత్తు కూడా సాయపడకపోగా పైపెచ్చు అమెరికా సామ్రాజ్యవాదుల సూచనపై వారి నాయకత్వాన ఆగ్నేయాసియా దేశాలలో సామ్రాజ్యవాదులతో కలసిపోయిన బూర్జువావర్గాలన్నింటినీ ఏకంచేసి ఒక అభివృద్ధినిరోధక విప్లవ ప్రతీఘాత కూటమిని నిర్మించేందుకు పునాదిని వేసింది.

● ప్రధాని నెహ్రూగారి 'బర్మాపై ఢిల్లీ కాన్ఫరెన్సు' యీ ఆశయాన్ని మరింత ముందుకు తీసుకొనిపోయింది. ఈ కాన్ఫరెన్సులో ఇండియాప్రభుత్వం సిగ్గువిడిచి మలయాప్రజల గొంతుకోస్తున్న ఖూనీకోర్ మూకవాలుతోనూ, శ్వేత దురభిమానంగల ఆస్ట్రేలియా ప్రతినిధితోనూ చేతులుకలిపి, బర్మా వ్యవహారాలలో సామ్రాజ్యవాదులు జోక్యం కలిగించుకోడానికి, బర్మా ప్రభుత్వానికి కరెన్ల అభివృద్ధినిరోధక నాయకత్వానికి

మధ్య ఐక్యత ఏర్పరచి, బర్మా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ముందుకు పురోగమించుతున్న విముక్తి ఉద్యమానికి అడ్డు పడేందుకు పన్నిన ప్లానులో భాగస్తురాలుగా చేసింది.

అట్లాంటిక్ ఒడంబడికపై సంతకాలు జరగడంతో యీనాడు ప్రపంచం ఖచ్చితమైన రెండు కూటాలుగా ఏర్పడిపోయింది. డాలర్ గుత్త పెట్టుబడిదారుల నాయకత్వాన సామ్రాజ్యవాద శక్తులూ, యుద్ధ ప్రేరేపకులూ ఒకవైపునా - సోవియట్ యూనియన్ నాయకత్వాన ప్రజాస్వామిక, సోషలిస్టు, శాంతి కాముక శక్తులు మరొకవైపునా - రెండు శిబిరాలు ఏర్పడ్డాయి. ఈ పరిస్థితులలో నెహ్రూ-పటేల్ ప్రభుత్వం సామ్రాజ్యవాద కూటమికి కీలుబొమ్మగా బహిరంగంగా బయటపడుతూ, సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా జరిగే యుద్ధానికి మిలిటరీ వ్యూహ కేంద్రంగా ఇండియాను సామ్రాజ్యవాదులకు అమ్మేందుకు సిద్ధపడుతున్నది.

ఇండియా నిర్వహించబోతున్న యీ జోహుకుం పాత్రకు బదులుగా నెహ్రూ ప్రభుత్వం ప్రాతినిధ్యం వహిస్తున్న భారత పెట్టుబడిదారీ వర్గం - టాటాలూ, బిర్లాలూ తమ అమెరికన్ యజమానుల వద్దనుండి-వారు సంపాదించుకొంటున్న లాభాలూ, మార్కెట్లలో - కొద్దిపాటి భాగాన్ని వారి దయాదాక్షిణ్యాలపై తాముకూడా అనుభవించడానికి ఆశిస్తున్నారు.

ఈవిధమైన పాలసీ భారత కార్మికవర్గానికీ, భారత శ్రామిక ప్రజాకోటికి బహు ప్రమాదకరమైన ఫలితాలను తెచ్చిపెడుతుంది. ఈ పాలసీ భారతదేశ వలస వ్యవస్థనూ, పీడనను శ్రామిక ప్రజల దారిద్ర్యాన్నీ మరింత ఎక్కువచేస్తుంది. ఈ విపరీతమైన పీడనాపద్ధతిని బలవంతంగా ప్రజలపై రుద్దేందుకు అమెరికన్ పద్ధతులపై ఫాసిస్టు బీభత్స నిర్బంధవిధానం అమలు జరుపబడుతుంది. భారత కార్మిక వర్గాన్నీ శ్రామిక ప్రజానీకాన్నీ సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా అమెరికా సామ్రాజ్యవాదుల యుద్ధంలోకి - పతనమవుతున్న పెట్టుబడిదారీ విధానాన్ని రక్షించేందుకు జరిగే మారణ యుద్ధంలోకి-సమిధల్లా వినియోగించుతారు.

మన దేశాన్ని 'వాల్ స్ట్రీట్' రథానికి అంటకట్టడానికి ప్రయత్నించుతున్న ఇండియాలోని పిల్లసామ్రాజ్యవాదులు ప్రత్యర్థుల బలాన్ని అంచనావేయకుండా తయారవుతున్నారు.

ప్రపంచ మంతటా శాంతికోసం, ప్రజాతంత్రం కోసం, సోషలిజం

కోసం పోరాడే శక్తులబల ప్రతిష్ఠలు ఎంతటి మహోన్నత శిఖరాన్ని ఈనాడు అందుకొన్నాయంటే అవి ప్రస్తుతం సామ్రాజ్యవాద యుద్ధోన్మాదుల అసలు అస్తిత్వాన్నే సవాలు చేసే అంతటి కీలక స్థితిలో వున్నాయి.

● తూర్పుయూరప్ అంతా—బ్రిటన్, ఫ్రాన్సుల రెండిటిలో వున్న జనాభాకంటే మిన్నగా జనసంఖ్యగల తూర్పుయూరప్ అంతా సామ్రాజ్యవాద వలయంలోనుండి పూర్తిగా బయటపడి ఈనాడు ప్రపంచ శాంతికి రక్షణకోటగా నిలబడివుంది. సామ్రాజ్యవాదుల ఆఖరిబంట్లుకూ, సోషల్ డెమోక్రట్ ద్రోహులకూ స్వస్తివాచకం చెప్పి, తూర్పుయూరప్‌లోని ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు ఐక్య కార్మిక వర్గ పార్టీల నాయకత్వాన సోషలిస్టు సమాజాన్ని నిర్మించేందుకు ఖచ్చితంగా ముందుకు సాగిపోతున్నాయి.

● ఫ్రాన్సులోనూ, ఇటలీలోనూ కమ్యూనిస్టు పార్టీలు ప్రధాన పార్టీలుగా అభివృద్ధిచెంది యావత్తు కార్మిక వర్గానికే ఆ దేశాలలోని శ్రామిక ప్రజా కోటికే ఎదురులేని నాయకత్వాన్ని సంపాదించడం, పశ్చిమ యూరప్‌లోని విప్లవ శక్తుల బలానికీ పరిపక్వదశకూ ప్రబల నిదర్శనంగా స్పష్టపడుతున్నది.

● ఆసియాఖండమంతటా కార్మిక వర్గం నాయకత్వాన మహత్తరమైన ప్రజల విముక్తి ఉద్యమాలు బ్రహ్మాండంగా ముందుకు సాగిపోతున్నాయి. బర్మాలో, మలయాలో, ఇండోనీషియాలో, వియత్నాంలో – ప్రతి చోటా సామ్రాజ్యవాదులు తమ డాలర్లతో, టాంకులతో, తుపాకులతో సహా తిరోగమనం చేస్తున్నారు.

## ప్రజా శిబిరానికి సోవియట్ నాయకత్వం

విప్లవ జ్వాలలతో ప్రజ్వరిల్లుతున్న ఆసియాకు మహత్తరమైన చైనా విముక్తి సైన్యం అగ్రగామిగా నిలబడి, చైనా విప్లవాన్ని పూర్తి చేయుడానికి విజయవంతంగా పురోగమించుతూ, ఆసియా ఖండంలోని సామ్రాజ్యవాదానికి చావు దెబ్బలు కొడుతోంది. ఇంకెంతో దూరానలేని చైనావిప్లవ అంతిమ విజయం ఆసియాలోనూ, దూరప్రాచ్యంలోనూ బలాబలాలను పెట్టుబడిదారీ విధానానికి, సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకంగానూ, సోషలిజం, ప్రజాస్వామికం, శాంతికాముక శక్తులకు అనుకూలంగానూ పూర్తిగా మార్చి వేస్తుంది. ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులకు ఆసియాలోవున్న తొత్తులందరికీ, యింక ముందు కాబోయే తొత్తులకూ చాంగ్ షేక్‌కు పట్టినగతే తప్పక పడుతుందని చరిత్ర వేయి నోళ్ళతో చాటి చెపుతోంది.

ఈ శక్తులన్నింటికీ నాయకుడుగా విజయవంతమైన సోషలిస్టు భూమి సోవియట్

యూనియన్ నిలబడివుంది. సోవియట్ యూనియన్ యిదివరకన్నడూ లేనంత అంతరంగిక బలంతోనూ, అంతర్జాతీయ ప్రతిష్ఠతోనూ యుద్ధాన్నుండి బయటపడి, సోషలిస్టు సమాజనిర్మాణాన్ని సంపూర్తిచేసుకొని నేడు అజేయ కమ్యూనిజంవైపుకు జయప్రదంగా సాగిపోతోంది.

గత నాలుగు సంవత్సరాల కాలంలో శాంతి కొరకూ, ప్రజాస్వామికం కోసం, జాతుల స్వాతంత్ర్యంకోసం అచంచలంగా సోవియట్ యూనియన్ నిర్వహించిన పాత్ర నేడు ప్రపంచ ప్రజాశిబిరానికి ఎనలేని ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చింది. దాని ఫలితంగా యీనాడు ప్రతి దేశంలోనూ కార్మికవర్గ నాయకత్వాన ప్రజాతంత్ర శక్తులు సోవియట్ యూనియన్‌కు అండగా తమస్థానాన్ని స్వీకరించి తమ తమ దేశాలలోని యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా కార్యరంగంలోకి ప్రవేశించుతున్నాయి.

ఈ పరిస్థితులలో భారత ప్రజలస్థానమెక్కడ?

యుద్ధశక్తులకూ, శాంతికాముక శక్తులకూ మధ్య జరుగుతున్న ప్రపంచ వ్యాప్తిగల యీ మహాసంఘర్షణలో భారతప్రజలు సోవియట్ యూనియన్‌తోపాటు శాంతి, ప్రజాస్వామికం, సోషలిజంల శిబిరంలో వుంటారా? లేక వాల్‌స్ట్రీట్ డాలర్ గుత్తపెట్టుబడిదారులతో సామ్రాజ్యవాద యుద్ధశిబిరంలో వుంటారా? ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ, సోషలిజానికి వారు పురోగమించ కోరతారా? లేక వాల్‌స్ట్రీట్ రథానికి కాళ్ళూ చేతులు కట్టివేసుకొని దానియొక్క అమానుష వలస విధాన దోపిడీకి పరికరాలలాగానూ, దాని యుద్ధానికి సమిధల్లాగానూ వినియోగపడ కోరతారా?

ప్రపంచమంతటా కార్మికవర్గం యీ ప్రశ్నకు ఎలాంటి సమాధానం ఇస్తూ వున్నదో, సరిగ్గా అలాంటి ఖచ్చితమైన సమాధానాన్నే భారత కార్మికవర్గమూ, భారత శ్రామిక ప్రజాకోటి ఆంగ్లో-సామ్రాజ్యవాదులకూ వారి స్థానికబూర్జువా ఏజెంట్లకూ నేడు యివ్వవలసి వుంది. తాము ఖచ్చితంగా సోవియట్ యూనియన్ పక్షాన సోవియట్ నాయకత్వాన వున్న శాంతి ప్రజాస్వామికం సోషలిజం శిబిరంలోనే వుంటామనీ, సామ్రాజ్యవాదం, పతనమవుతున్న పెట్టుబడిదారీ విధానం గల శిబిరానికీ, ఆంగ్లో-అమెరికన్ల యుద్ధానికీ వ్యతిరేకంగా నిలబడతామని సమాధానం చెప్పితీరాలి. యింతకంటె మరొక సమాధానమంటూ వుండరాదు.

మన దేశం నిజమైన జాతీయ స్వాతంత్ర్యాన్ని పొందాలంటే యిదొక్కటే మార్గం. ఈ మార్గమొక్కటే మన శ్రామిక ప్రజా

కోటికి ప్రజాస్వామిక ప్రజాతంత్రాన్నీ సోషలిజాన్ని తెచ్చిపెడుతుంది.

సోవియట్ యూనియన్ ఒక సోషలిస్టు రాజ్యమనీ, అది ప్రపంచ సోషలిజానికి దుర్గమనీ భారత కార్మిక వర్గానికీ, భారత శ్రామిక ప్రజానీకానికీ తెలుసు. సోషలిస్టు భారతావని కోసం తాము చేసే పోరాటం ప్రపంచ సోషలిజం కోసం అంతర్జాతీయ కార్మికవర్గం చేస్తున్న మహాపోరాటంలో ఒక అంతర్భాగమేనన్న విషయం కూడా వారికి తెలుసు. ఈ పోరాటానికి నాయకుడుగానూ, ప్రజా విజయానికి పురోగామి శక్తిగానూ సోవియట్ యూనియన్ నిలబడివుంది.

భారత పెట్టుబడిదారులకు ప్రాతినిధ్యం వహించే నెహ్రూ - పటేల్ ప్రభుత్వం తమ ఆంగ్లో - అమెరికన్ యజమానుల ఆజ్ఞల ప్రకారం ఇండియాను వాల్ స్ట్రీట్ వలస దేశంగానూ, ఆగ్నేయాసియా ప్రజల విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా కార్యకలాపాలు జరిపేందుకు ఒక మిలిటరీ కేంద్రంగానూ, సోవియట్ యూనియన్‌కు, ప్రజాస్వామిక ప్రజాతంత్ర చైనాకు వ్యతిరేకంగా జరిగే యుద్ధానికి ఒక ఆర్థిక, మిలిటరీ కేంద్రంగాను మార్చడానికి ప్రారంభించింది.

భారత దేశంలోని శ్రామిక ప్రజానీకమూ, మామూలు జనసామాన్యమూ, దాని అగ్రగామియైన కమ్యూనిస్టుపార్టీ ఈ నీచమైనకుట్ర కొనసాగకుండా పోరాడితీరుతాయి. వాల్ స్ట్రీట్ డాలర్ గుత్తపెట్టుబడిదారులకు తమ దేశం యొక్క ప్రయోజనాలనూ, శ్రామిక ప్రజ ప్రయోజనాలను అమ్మడానికి నెహ్రూ - పటేల్ ప్రభుత్వం చేసే ప్రతి ప్రయత్నాన్నీ ప్రతిఘటించి తీరుతారు. ఆసియాలోని మన సోదరుల జాతీయ విముక్తి ఉద్యమాలను అమానుషంగా అణచి వేసే కేంద్రంగానూ, సోవియట్ యూనియన్‌కు వ్యతిరేక యుద్ధ కేంద్రంగానూ ఇండియాను మార్చడానికి నెహ్రూ - పటేల్ ప్రభుత్వం చేసే ప్రతి ప్రయత్నాన్నీ భారతశ్రామిక ప్రజ ప్రతిఘటించి తీరుతుంది.

సామ్రాజ్యవాద - బూర్జువా ఫ్యూడల్ ఐక్యమునుతోనూ, పాత వలస ఆర్థిక విధానానికీ వ్యతిరేకంగా నిజమైన స్వాతంత్ర్యానికీ, ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ, సోషలిజానికీ తామే స్వయంగా పోరాడుతున్న భారత శ్రామిక ప్రజాకోటి తనకున్న యావత్ శక్తినీ వినియోగించి ఆగ్నేయాసియాలోనూ, చైనాలోనూ జరుగుతున్న మహత్తరమైన ప్రజల విముక్తి పోరాటాలను తప్పనిసరిగా గట్టిగా బలపరుస్తుంది. తమ విముక్తికీ యావత్తు ఆసియా విముక్తికీ యిదే మార్గమని వారికి తెలుసు.

భారత శ్రామిక ప్రజానీకమూ; మామూలు జనసామాన్యమూ కార్మికవర్గ నాయకత్వాన, దాని అగ్ర

గామి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ఎలాంటి పరిస్థితులలోనైనా ఇండియాను యుద్ధకేంద్రంగా గానీ, లేక ఇండియా సోషలిస్టు భూమికి వ్యతిరేక యుద్ధంలోకి యీడ్వబడటానికిగాని చేసే ప్రయత్నాన్ని ఎంతమాత్రమూ సాగనివ్వరు. దాని సహజ ప్రవృత్తి రీత్యానే సోవియట్ యూనియన్ ఒక సోషలిస్టు రాజ్యమనీ, ఒక కార్మిక కర్షక రాజ్యమనీ మనిషిని మనిషీ, జాతిని జాతీ దోపిడి చేసే విధానాలన్నింటికీ అది గర్భ శత్రువనీ, అన్ని దేశాలలోని అణచబడిన పీడిత జనసామాన్యం ప్రయోజనాలకు పోరాడే ఒక మహాయోద్ధరనీ, భారత శ్రామిక ప్రజానీకానికి తెలుసు. అంతేకాదు; తమ ప్రయోజనాలూ, సోవియట్ యూనియన్ ప్రయోజనాలూ ప్రతి విషయంలోనూ ఒకటేననే విషయం కూడా వారికి తెలుసు.

ఇండియాను సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా బహిరంగంగా జతపరచే యే ప్రయత్నానికైనా కార్మికవర్గాన్నుండీ, మన దేశంలోని జనసామాన్యం నుండీ అత్యంత ప్రతికూలతతో కూడుకొన్న ప్రతిఘటనవచ్చి తీరుతుందనే విషయం నేటి భారతదేశ పరిపాలకులకు స్పష్టంగా తెలిసిన విషయమే. అందువల్లనే నెహ్రూ ప్రభుత్వపు సామ్రాజ్య అనుకూల, సోవియట్ వ్యతిరేక పాలసీల పోకడలన్నీ అతిరహస్యంగా బ్రిటిష్, అమెరికన్ "రాజకీయవేత్తల"తో జరుపుతున్న సంప్రతింపులలో కొనసాగుతున్నాయి. వీటన్నింటినీ నెహ్రూ ప్రధాని బయటకు చెప్పుతున్న "స్వతంత్ర విదేశాంగ విధానం" "తటస్థ విధానం" అనే ముసుగుల క్రింద మరుగుపరచడానికి ప్రయత్నిస్తున్నారు.

మన దేశంలోని అత్యధిక మెజారిటీ సంఖ్యగల ప్రజల ప్రయోజనాలకూ, అభీష్టాలకూ విరుద్ధంగా పన్నబడుతున్న ఈ విద్రోహపూరిత పాలసీకి పూర్తిగా స్వస్తిచెప్పవలసి ఉంది. భారతకార్మికవర్గమూ, భారతశ్రామిక ప్రజాకోటీ తమ యావత్తు ప్రజాప్రతిఘటనా శక్తిని వినియోగించి, సామ్రాజ్యవాదానికి, యుద్ధానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో తమ మిత్రుడు, సహచరుడు అయిన సోవియట్ యూనియన్‌కు అండగా వుంటామని, తమ ఖచ్చితమైన, దృఢమైన ఏకీభావాన్ని ప్రకటించినట్లయితే యీ ద్రోహపూరితమైన పాలసీని తప్పకుండా అంతమొందించవచ్చు.

ఆగ్నేయాసియాలో వీరోచితంగా పోరాడుతున్న ప్రజలతో పాటు, విజయవంతంగా ముందుకు పురోగమించుతున్న చైనా విముక్తి సైన్యంతో పాటు, భారత కార్మిక వర్గమూ, భారత శ్రామిక ప్రజా కోటీ అంతర్జాతీయ కార్మిక వర్గమూ దాని అగ్రగామి సోవియట్ యూనియన్ నాయకత్వాన వున్న ప్రపంచ ప్రజా శిబిరంలో తమ స్థానాన్ని దృఢంగా స్వీకరించి, ప్రపంచ సోషలిజం

కోసం, వివిధజాతుల స్వాతంత్ర్యం కోసం ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదానికీ, దాని యుద్ధ పన్నాగాలకూ వ్యతిరేకంగా జరిగే మహాపోరాటంలో చురుకుగా పాల్గొంటాయి.

—"కరెంట్ ఎఫైర్సు" నుండి (3—4—49)

"కార్మికవర్గంయొక్క ప్రధాన ప్రయోజనాలకు సంబంధించిన శాస్త్రీయసిద్ధాంతమే మార్క్సిజం. మార్క్సిజాన్ని నాశనంచేయాలంటే కార్మికవర్గాన్నే నాశనం చేయవలసిఉంటుంది. కార్మికవర్గాన్ని నాశనంచేయడం అసంభవమైన విషయం. మార్క్సిజంవచ్చి ఇప్పటికి 80 సంవత్సరాలకుపైగా అయింది. మార్క్సిజాన్ని నాశనంచేయడానికి వందలకొలది. బూర్జువాప్రభుత్వాలు ప్రయత్నించాయి. కాని పర్యవసానం? అనేక బూర్జువాప్రభుత్వాలు వచ్చాయి. పతనమయ్యాయి. కాని మార్క్సిజంమాత్రం ఎప్పుడూ ముందుకే ముమ్ముందుకే పురోగమిస్తూఉంది."

—స్టాలిన్

(లెనినిజం, సెలెక్టెడ్ రైటింగ్స్, పేజీ 359)

## సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో

# సిద్ధాంతైక్యత

—ఎ. టిమోఫెయెవ్‌స్కీ

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అనేక మహత్తర విజయాలను సాధించింది. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన రష్యాప్రజలు శ్రామిక విప్లవాన్ని జయప్రదంగా సాగించారు. సోషలిస్టు సమాజాన్ని నిర్మించారు. కమ్యూనిజం వైపు పురోగమిస్తున్నారు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఇంతటి ఘనవిజయాలను ఎలా సాధించగలిగింది? ఈ విజయాలకు మూలకారణ మేమిటి? ఆ పార్టీయే అసలు ఒక కొత్తరకపు పార్టీ కావడం, లెనిన్ స్టాలిన్ లాంటి మహోన్నత వ్యక్తులచే నిర్మించబడి అవకాశవాదులకూ, కార్మికవర్గ శత్రువులకూ అభేద్యమైన కోటగా ఉండడం ఇందుకు ప్రధాన కారణం. సోషలిస్టు విప్లవాన్నీ శ్రామిక నియంతృత్వాన్నీ సాధించిన పార్టీయే బోల్షివిక్ పార్టీ.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమమూ, ఎత్తుగడలూ, నిర్మాణసూత్రాలూ మార్క్సిజం - లెనినిజం యొక్క బలమైన పునాదులపై ఆధారపడి ఉన్నాయి.

లెనిన్ స్టాలిన్‌లు బోల్షివిక్ పార్టీని స్థాపించిన నాటినుంచి పార్టీలో సిద్ధాంత ఐక్యతకోసం తీవ్రంగా కృషిచేశారు. సామాజికాభివృద్ధికి సంబంధించి శాస్త్రీయ సూత్రాలూ శ్రామిక విప్లవాభివృద్ధికి సంబంధించిన సూత్రాలూ, సోషలిస్టు సమాజ నిర్మాణానికీ కమ్యూనిజంయొక్క విజయానికి సంబంధించిన మార్క్సిజం - లెనినిజం సూత్రాలే బోల్షివిక్ పార్టీ సిద్ధాంతాలు. లెనినిస్టు వ్యతిరేక పోకడలకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో బోల్షివిక్ పార్టీ సిద్ధాంతాలు అభివృద్ధిచెందడంతోపాటు పార్టీలో సిద్ధాంత ఐక్యతకూడా ఏర్పడింది.

బోల్షివిక్కులు తమ సిద్ధాంత భావాలను కాపాడుకుంటూనే - నిలబెట్టుకుంటూనే - అవకాశవాదులూ లెనినిస్టు వ్యతిరేక గ్రూపులూ వ్యాపింపజేసే బూర్జువాసిద్ధాంతాలకు వ్యతిరేకంగా తీవ్రమైనపోరాటం సాగించారు. కార్మికోద్యమంలో బూర్జువాసిద్ధాంతాలుచొరబడకుండా బోల్షివిక్కులు తగు జాగ్రతవహించారు. శ్రామికవర్గ సోషలిస్టుభావాల అజేయశక్తిని నిరూపించారు.

పోరాటంలో అంతరంగిక విభేదాల నతిక్రమించి, తద్వారా పార్టీ అభివృద్ధిచెందడం గట్టిపడడం - ఇది శ్రామికవర్గ పార్టీల అభివృద్ధికి సంబంధించిన శాస్త్రీయసూత్రం. కాని నిస్టు వ్యతిరేక గ్రూపులతో, పోకడలతో బోల్షివిక్ పార్టీ సాగించిన పోరాటమంతా పార్టీ అంతరంగిక విభేదాల సంఘర్షణకు సంబంధించిన చరిత్ర. ఈ అంతరంగిక విభేదాల నెదుర్కొని, అతిక్రమించి, క్రమంగా పార్టీని గట్టిపరచడమే బోల్షివిక్ పార్టీ చరిత్ర. పార్టీ పాలసీకి సంబంధంలేకుండా ఆ విభేదాలను ప్రత్యేకంగా పరిష్కరించడమంటూ జరగలేదు. కార్మికవర్గంయొక్క విప్లవపోరాటాశయాలకు - సోషలిజంకోసం సాగించే పోరాటంయొక్క పద్ధతులకూ సాధనాలకూ- సంబంధించిన ప్రధాన సమస్యలతోనే వాటిని పరిష్కరించడం జరిగింది.

"సిద్ధాంత సమస్యల్లో 'మధ్య' మార్గంఅంటూ లేదు. అసలు ఉండజాలదు. కొన్ని నిర్ణీత సూత్రాలే పార్టీకృషికి ఆధారభూతంగా ఉంటాయి. సిద్ధాంత సమస్యలలో 'మధ్య' మార్గాన్ని అవలంబించటం అంటే మందబుద్ధిని ప్రదర్శించడం, విభేదాలను మరుగుపరచి మసిపూసి మారేడుకాయ చేయడం. సిద్ధాంతరీత్యా పార్టీ హీనస్థితికి దిగజారిపోవడం, చివరకు సైద్ధాంతికంగా పార్టీ మరణించడం జరుగుతుంది," అని కామ్రేడ్ స్టాలిన్ చెప్పాడు.

పశ్చిమ దేశాల్లోని సోషల్ డెమోక్రటిక్ పార్టీలు తమలో ఉన్న కుళ్లును కడిగివేయలేదు. తమలో ఉన్న లోపాలను పార్టీ ప్రజల సమక్షాన నిర్మొగమాటంగా, బాహాటంగా చిత్తశుద్ధితో అంగీకరించడం అంటూ జరగలేదు. స్టాలిన్ చెప్పినట్లుగా పశ్చిమదేశాల్లోని సోషల్ డెమోక్రటిక్ పార్టీలు క్షీణించి హీనస్థితికి దిగజారిపోడానికీ, సిద్ధాంతరంగంలో ఆ పార్టీలు దివాళా తీయడానికీ, ఇదే ప్రధాన కారణం.

కాని బోల్షివిక్ పార్టీ అవలంబించిన పంథా అందుకు పూర్తిగా భిన్నమైంది. బోల్షివిక్ పార్టీ స్థాపించబడినప్పటినుంచీ కార్మికవర్గ శత్రువుల ప్రయోజనాలకోసం ప్రయత్నించే అవకాశవాదులను ఎప్పటికప్పుడే బైటికి నెట్టివేయడం జరిగింది.

"సభ్యుల్లో అంతరంగిక ఐక్యతను నిర్మించడంలోనూ, అవినాభావ సంబంధాన్ని అద్వితీయంగా కాపాడడంలోనూ, మన పార్టీ జయప్రదంగా పనిచేసింది. పార్టీనుంచి దిగజారుడుగాండ్లనూ, మితవాదులనూ, (మెన్షివిక్కులు) ఎప్పటికప్పుడు బైటికిగెంటివేయడంవల్లనే ఈ పని సాధ్యమయింది. అవకాశవాదులనూ, సంస్కరణవాదులనూ సాంఘిక (సోషల్) సామ్రాజ్యవాదులనూ, సాంఘిక దురహంకారులనూ, సాంఘిక దేశభక్తులనూ, సాంఘిక నిరాశావాదులనూ (ఫాసిఫిస్టు) వెళ్ల

గొట్టి పార్టీని శుద్ధిచేయడంద్వారానే శ్రామికవర్గపార్టీలు అభివృద్ధి చెందుతాయి బలపడుతాయి. అవకాశవాదులకు స్వస్తిచెప్పడంద్వారానే పార్టీ గట్టిపడుతుంది.”

(జె. వి. స్టాలిన్, ప్రాబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, పేజీ 83)

ఈ పంథాపైనే బోల్షివిక్ పార్టీ అభివృద్ధి చెందింది.

‘అర్ధికవాదులు’ రష్యాలోని మార్క్సిస్టు ఆర్గనైజేషన్‌లో మొదటి సంస్కరణ గ్రూపు - అవకాశవాద గ్రూపుకు చెందినవారు. వీరు ఒక రకమైన అంతర్జాతీయ అవకాశవాదానికి ప్రాతినిధ్యం వహించేవారు. మార్క్సిజాన్ని సంస్కరించ (రివిజన్) బూనుకున్న పశ్చిమ యూరపులోని బెర్న్‌స్టీన్ ముఠాకు అత్యంత సన్నిహితంగా రక్తసంబంధీకుల్లాగా ఉండేవారు. విప్లవసిద్ధాంతంయొక్క పాత్రను తక్కువ అంచనావేశారు. విప్లవసిద్ధాంతమూ, విప్లవపార్టీ నిర్మాణంయొక్క అవసరాన్ని గుర్తించ నిరాకరించారు. కార్మికోద్యమంలో పార్టీయొక్క నాయకపాత్రను తక్కువ అంచనా వేశారు.

‘అర్ధికవాదుల’తో అసలు ప్రధాన సిద్ధాంతాల్లోనే తీవ్రమైన విభేదాలుండేవి. ‘అర్ధికవాదుల’తో పూర్తిగా తెగతెంపులు చేసుకోకుండా రష్యాలో ఐక్యకేంద్రీకృత మార్క్సిస్టు పార్టీని నిర్మించడం అసంభవం అని గ్రహించిన లెనిన్ స్టాలిన్‌లు ‘అర్ధికవాదుల అవకాశవాదానికి వ్యతిరేకంగా తీవ్రపోరాటం జరిపారు.

“పార్టీలో ఐక్యతను సాధించే ముందు’ ఐక్యతను నిర్మించడంకోసం, ‘అర్ధికవాదుల’తో ముమ్మ్రాందే మనం తెగతెంపులు చేసుకోవాలి” అని లెనిన్ స్పష్టంగా తన ఆశయాన్ని ఉద్ఘాటించాడు.

రష్యన్ మార్క్సిస్టుల్లో పైపై నామమాత్రపు ఐక్యతకోసం - అతుకుల బొంతలాంటి ఐక్యతకోసం - అసలు ప్రధాన సిద్ధాంతాలకే తిలోదకాలు ఇవ్వడానికి సిద్దపడే కొందరు రాజకీయవాదులకు లెనిన్ విధానం నచ్చలేదు. కాని లెనిన్ తన పట్టుదల నేమాత్రం సడలించలేదు. ‘అర్ధికవాదుల’ అవకాశవాద విధానాన్ని ఎప్పటికప్పుడు బట్టబయలు చేస్తూ ఉండేవాడు.

‘అర్ధికవాదుల’కు వ్యతిరేకంగా సాగించిన సిద్ధాంత పోరాటంలో లెనిన్ యొక్క ‘ఇస్క్రా’ విప్లవవిధానం - మార్క్సిస్టు విప్లవ సిద్ధాంతం - జయించింది.

అర్ధికవాదాన్ని ఇంకా ముందుకు కొనసాగించడమే మెన్షివిజం (మితవాదం) అవుతుంది. మెన్షివిక్కుల అవకాశవాదం మొదట నిర్మాణసమస్యల్లో ద్యోతకమయింది. లెనిన్ చెప్పిన విధంగా విప్లవపంథాపై పార్టీని నిర్మించడాన్ని వారు వ్యతిరేకించారు. అస్పష్టమైన, నిర్ణీత కార్యక్రమంలేని, సంఘటితం కాని పార్టీ ఉండాలని కోరారు. ఇలాంటి పార్టీ ప్రజాసామాన్యానికి నాయకత్వం వహించి నడిపేదానికి బదులుగా అదే ప్రజల తోకబుచ్చుకొని పోతుంది. అవకాశవాదులతోనిండి కలగాపులగంగా ఉన్న జర్మన్, ఫ్రెంచ్ సోషల్ డెమాక్రటిక్ పార్టీల్లాంటి పార్టీయే రష్యాలోకూడా ఉండాలని వారి ఉద్దేశం. పశ్చిమ దేశాల్లో ఉన్న సోషల్ డెమోక్రటిక్ పార్టీలు

"అవకాశవాదులతో, మార్క్సిస్టులతో విప్లవశత్రువులతో విప్లవ మిత్రులతో — పార్టీ సిద్ధాంతాన్ని బలపరిచేవారితోనూ, వ్యతిరేకించేవారితోనూ — కలసిమెలసి కలగాపులగంగా ఉండేవి. తత్ఫలితంగా మార్క్సిస్టులు అవకాశవాదులతో కలిసిపోవడం, వారికి లొంగిపోవడం జరిగింది."

(సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర, ఇంగ్లీషు ఎడిషన్, పేజీ 140)

రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ ద్వితీయ కాంగ్రెసు సమావేశ సందర్భంలో నిర్మాణ సమస్యలపై ఏర్పడిన తీవ్ర విభేదాల ఫలితంగా రష్యన్ సోషల్ డెమాక్రాట్లు రెండు గ్రూపులుగా — బోల్షివిక్కులు మెన్షివిక్కులుగా — చీలిపోవడం జరిగింది.

నిర్మాణ సమస్యలపై అవకాశవాదానికి వ్యతిరేకంగా లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కులు సాగించిన పోరాటంలో లెనినిస్టు నిర్మాణసూత్రాలకే విజయం లభించింది. శ్రామిక వర్గ పార్టీ అయిన ఈ కొత్తరకపు పార్టీకి ఈ సూత్రాలే పునాదులుగా అంగీకరించబడ్డాయి.

1905-1907లో జరిగిన మొదటి రష్యా విప్లవసమయంలో బోల్షివిక్కులమధ్య, మెన్షివిక్కులమధ్య అతితీవ్రమైన విభేదాలు ఏర్పడ్డాయి. కార్మిక కర్షకవర్గాల సన్నిహిత సంబంధంతో శ్రామికవర్గ విప్లవంలో నాయకపాత్ర వహిస్తుందని బోల్షివిక్కులు వాదించారు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవంనుండి గ్రామీణ పేదప్రజల సహకారంతో వెంటనే సోషలిస్టు విప్లవానికి పురోగమించేందుకు అవసరమైన కార్మిక రైతువర్గాల విప్లవాత్మక ప్రజాస్వామిక నియంతృత్వంవైపు బోల్షివిక్కులు ఉద్యమాన్ని నడిపిస్తున్నారు. బూర్జువా ప్రజాస్వామిక విప్లవంలో శ్రామిక వర్గ నాయకత్వం అనే సిద్ధాంతాన్ని మెన్షివిక్కులు త్రోసిపుచ్చారు. కార్మిక రైతు వర్గాల సన్నిహిత సంబంధానికి బదులుగా లిబరల్ బూర్జువావర్గంతో రాజీపడటానికి — విప్లవంలో లిబరల్ బూర్జువావర్గానికే నాయకత్వం ఇవ్వడానికి — సిద్ధపడ్డారు.

ఇవి చాలా తీవ్రమైన విభేదాలు. రష్యా విప్లవ భవిష్యత్తు ఈ సమస్యలపైనే ఆధారపడి ఉంది. బోల్షివిక్కులు సాగించిన తీవ్రపోరాటం ఫలితంగా వారి రాజకీయసంధాయే జయించింది.

రష్యాలో మొదటి విప్లవం ఓడిపోయిన తర్వాత మెన్షివిక్కులు పార్టీని పూర్తిగా రద్దుచేసివేయాలన్నారు. గతంలో రష్యా శ్రామికవర్గపార్టీ చేసిన ప్రతివిషయాన్ని తప్పులతడకగా చిత్రించారు రహస్యంగా పనిచేసే విప్లవాత్మకమైన శ్రామికవర్గపార్టీ అసలు ఉండడమే అనవసరమని వాదించారు. 1908 లో ఒక చిన్న 'ఒట్జోవిస్టుల' గ్రూపు పార్టీలోకి దూరింది. డ్యూమా (శాసనసభ) నుంచి సోషల్ డెమాక్రటిక్ ప్రతినిధులను వెనక్కు రప్పించాలి (ఒట్జోవిస్టు అనగా రష్యా భాషలో 'ఉపసంహరించుకోవడం' అని అర్థం) అని డిమాండ్ చేశారు. ట్రేడ్ యూనియన్ వగైరా కార్మికసంఘాల్లో పనిచేయడానికి వీరు పూర్తిగా నిరాకరించారు. అతివాదశబ్దజాలంతో తమ అవకాశవాదాన్ని ముసుగు పరిచేవారు పార్టీలోపలేఉండి పార్టీని దెబ్బగొట్టే విచ్ఛిన్నకులు వీరు. జారుపరిపాలన సమయంలో, ఆ పరిస్థితుల్లో, చట్టబద్ధసంఘాలను విప్లవ కార్యక్రమంకోసం ఉపయోగించుకునే అవకాశాన్ని చెడగొట్టాలని ప్రయత్నించారు. ఈ సమస్యలన్నిటిపై ట్రాట్స్కీ, అతని

ముఠా అవలంబించిన పంథా ఇదే. ఈ దిగజారుడు విధానాన్ని (లిక్విడేషనిజం) వ్యతిరేకించి లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కులు తీవ్రంగా పోరాడారు. రహస్యపార్టీ నిర్మాణాన్ని బలపరిచారు. కార్మిక ప్రజలతో తమకున్న సంబంధాలను ఇంకా విస్తృతంచేశారు.

నిరంకుశ పరిపాలనలో విప్లవ కార్యక్రమం కొనసాగించడం చాలా కష్టమైనపని. అయినా ఆ కష్టాలన్నిటినీ అతిక్రమించి బోల్షివిక్కులు విజయం సాధించారు.

1912లో ప్రేగ్‌లో జరిగిన రష్యన్ సోషల్ డెమొక్రటిక్ లేబరుపార్టీ నిర్ణయం ప్రకారం శ్రామికపార్టీనుంచి మెన్షివిక్కులనూ, అతివాదులనూ బైటికి నెట్టివేశారు. అప్పటినుంచి బోల్షివిక్ పార్టీకి సరియైన ఒక స్వతంత్ర నిర్మాణ స్వరూపం ఏర్పడింది. రష్యాలో విప్లవోద్యమాభివృద్ధికి ఇది ఎంతగానో తోడ్పడింది.

కార్మిక వర్గ శ్రేయస్సుకు ద్రోహంచేసే మెన్షివిక్ రాజీవాదులను బోల్షివిక్కులు పార్టీనుంచి వెళ్ళగొట్టకుండా ఉన్నట్లయితే శ్రామిక వర్గ నియంతృత్వంకోసం జరిగిన పోరాటంలో ప్రజాసామాన్యాన్ని ముందుకు నడిపించలేకపోయేది:”

(సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర, ఇంగ్లీషు ఎడిషన్ పేజీ 144)

రష్యా శ్రామికవర్గ పార్టీలో 1947 మహాగడ్డుసంవత్సరం. ఈ సంవత్సరంలోనే నవంబరు సోషలిస్టు విప్లవానికి సర్వసన్నాహం చేయబడింది. విప్లవం కొనసాగించబడింది. సోషలిస్టు విప్లవ పురోగమనానికి ప్రతిబంధకాలుగా ఉన్న ఆనాటి ఛోటా బూర్జువా సంస్కరణవాద పార్టీలను ప్రజలనుంచి దూరం చేయడానికి లెనిన్ స్టాలిన్‌ల నాయకత్వాన బోల్షివిక్కులు తీవ్రంగా కృషిచేశారు. పార్టీలోనే ఉన్న కమెనేవ్, జినోవ్యేవ్, రైకోవ్ లాంటి వ్యక్తులు పోరాటంలో రానున్న తీవ్రతనుచూచి హడలిపొయ్యారు. వారికి గుండెలు జారిపొయ్యాయి. రష్యా బూర్జువావర్గంయొక్క అంతర్జాతీయ బూర్జువా వర్గంయొక్క బలాన్ని వాళ్ళు ఎక్కువ అంచనావేశారు. శ్రామికవర్గ శక్తిని తక్కువ అంచనావేశారు. శ్రామికవర్గం రష్యాలో అధికారాన్ని హస్తగతం చేసుకోలేదనీ, ఒకవేళ చేసుకున్నా దాన్ని నిలబెట్టుకోలేదనీ యీ లొంగుబాటుదారులు ప్రకటించారు. ఇలాంటి లొంగుబాటుదారులను, విప్లవద్రోహులను పార్టీ ఎప్పటికప్పుడు బట్టబయలు చేసింది. పార్టీనుంచి ఇలాంటి వ్యక్తులందరిని బైటికి తరిమివేయడం జరిగింది.

ఇలాంటి లొంగుబాటుదారుల సహకారం లేకుండానే, వాళ్ళు వ్యతిరేకించినప్పటికీ లెక్కచేయకుండానే బోల్షివిక్కులు నవంబరు సోషలిస్టు విప్లవాన్ని సాగించారు.

శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పడడంతో రష్యాలో కమ్యూనిస్టుపార్టీయే పరిపాలనాధికారాన్ని చేపట్టింది.

ట్రాట్స్కీ, బుఖారిన్ ముఠాలు తమ నిజ స్వరూపాన్ని మరుగు పరుచుకొని మొదట పార్టీలో జొరబడగలిగారు. వీరు పార్టీలో మెన్షెవిక్కుల ఏజెంట్లుగా పనిచేసేవారు. కార్మిక వర్గంలోనూ, అగ్రపార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీలోనూ బూర్జువా భావాలు వ్యాపింపజేస్తూ ఉండేవారు.

ఇలాంటి అవకాశవాదులకు వ్యతిరేకంగా లెనిన్ స్టాలిన్‌లు పార్టీలో నిరంతర పోరాటం సాగించారు. పార్టీ సభ్యులు వారి బూర్జువా భావాల ప్రచారానికి లొంగిపోకుండా కాపాడారు. ఇలాంటి ద్రోహులను పార్టీనుంచి బైటికి వెళ్ళగొట్టి వేశారు. ఈ పోరాటం ఫలితంగా కులక్కుల (ధనిక రైతుల) ప్రతిఘటనను అణచివేయడం, ట్రాట్‌స్కీ, జినోవ్‌యేవ్ ముఠాల నిజస్వరూపాన్ని - సోవియట్ వ్యతిరేక స్వరూపాన్ని - బట్టబయలు చేయడం, పార్టీసభ్యత్వానికి ఇలాంటి లొంగుబాటుదారులూ, మితవాదులూ, కార్మికవర్గ ద్రోహులు ఏవిధంగా పనికిరారో రుజువు చేయడం జరిగింది.

అవకాశవాదులకు, లొంగుబాటుదారులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో పార్టీలో ఈ విధంగా లెనిన్ స్టాలిన్‌ల సిద్ధాంత ఐక్యత, నిర్మాణ ఐక్యత సాధించబడింది.

నవనవోన్మేషమైన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత ప్రాతిపదికపై బోల్షివిక్ పార్టీలో సిద్ధాంత ఐక్యత నిర్మింపబడింది.

సిద్ధాంత ప్రాముఖ్యతను తగ్గించడంగానీ, పూర్తిగా నిరాకరించడంగానీ, లేక ఏవో నాలుగు సూత్రాలను ముక్కుమీద పెట్టుకొని సందర్భశుద్ధి లేకుండా వాటిని వల్లించడంగానీ చేస్తూవుంటారు అవకాశవాదులు. మార్క్సిస్టుసూత్రాలను కొన్ని ఛాందస సూత్రాలుగా మాత్రమే వాళ్ళు భావిస్తారు. మార్క్సిజాన్ని పరిస్థితుల కనుగుణంగా అన్వయించాలని కానీ కొత్తగావచ్చిన అనుభవం ద్వారా మార్క్సిజాన్ని ఎప్పటికప్పుడు అభివృద్ధి చేస్తూవుండాలనిగానీ, కార్యాచరణకు మార్క్సిజం మార్గదర్శకుడుగా పనిచేస్తుందనిగానీ వాళ్ళకి తెలియదు.

లెనిన్ స్టాలిన్ రచనల్లో మార్క్సిజాన్ని ఇంకా ఇతోధికంగా అభివృద్ధి చేయడం జరిగింది. మార్క్సిజం బోల్షివిక్కులచేతుల్లో ఒక ప్రధాన సిద్ధాంతాయుధంగా ఉపయోగించింది.

"బోల్షివిక్ మా పార్టీనాయకులు మార్క్సిజంలో ప్రావీణ్యాన్ని సంపాదించక పోయినట్లయితే, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వారు కార్యాచరణకు మార్గదర్శకంగా భావించక పోయినట్లయితే, శ్రామికవర్గ పోరాటం ద్వారా కొత్తగా గడించిన అనుభవంతో మార్క్సిజాన్ని జోడించి దాన్ని ఇంకా పురోగమింపచేయక పోయినట్లయితే బోల్షివిక్‌పార్టీ 1917 నవంబరులో విజయాన్ని సాధించగలిగేదికాదు.

(సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర ఇంగ్లీషు ఎడిషన్, పేజి 355)

లెనిన్ స్టాలిన్‌లు విప్లవాత్మకమైన శ్రామిక వర్గం చేతుల్లో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని మహత్తర శక్తి సంపన్నమైన ఒక ఆయుధంగా తయారు చేశారు.

విప్లవ సిద్ధాంతం లేకుండా బలమైన విప్లవ పార్టీ ఉండజాలదు అని లెనిన్ మొదటినుంచీ బోధిస్తూనే ఉన్నాడు.

కార్మికవర్గ పోరాటంలోనూ జీవిత పరిస్థితుల్లోనూ వచ్చిన చారిత్రక మార్పులకు అనుగుణంగా మార్క్సిజాన్ని అన్వయింప జేయవలసిన ఆవశ్యకతను గురించి లెనిన్ హెచ్చరించాడు.

"మార్క్సిజం సంపూర్తి అయిందనిగానీ, అందులో ఇంకేటువంటి అభివృద్ధి జరగదని కానీ మేము భావించం. మార్క్సిజం శాస్త్రీయ దృష్టికి శంకు స్థాపన మాత్రమే చేసింది. నిత్యాభివృద్ధి చెందే జీవితంతోపాటు తాముకూడా పురోగమించ దలచుకుంటే సోషల్ డిమోక్రాట్లు మార్క్సిజాన్ని సర్వతోముఖంగా ఇంకా అభివృద్ధి చేయవలసి ఉంటుంది" అని లెనిన్ వ్రాశాడు.

మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఏ విధంగా అభివృద్ధిచేయాలో లెనిన్ స్టాలిన్‌లు చక్కని ఆదర్శప్రాయమైన మార్గాన్ని చూపెట్టారు. సోషలిస్టు విప్లవంలో పార్టీలో సిద్ధాంత ఐక్యతకు ఎంత ప్రాముఖ్యత ఉందో వివరించారు మొత్తం బూర్జువావర్గానికంతకు వ్యతిరేకంగా ఏకాకిగా ఒక్క శ్రామిక వర్గమే విప్లవం సాధించదనీ, శ్రామికవర్గ నాయకత్వాన అర్ధశ్రామిక ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగివున్న శ్రామికవర్గం విప్లవాన్ని సాధిస్తుందనీ తెలియజేశారు. సోషలిజం మొట్టమొదట ఒక దేశంలోకూడా విజయం పొందుతుంది అనే లెనిన్ మహోన్నత సిద్ధాంతంతో సోషలిస్టు విప్లవం కార్యరూపం ధరించింది.

ఒక్కే ఒక దేశంలో మొట్ట మొదట సోషలిజం జయించదు. అనేమార్క్స్-ఎంగిల్సుల సూత్రాన్ని అవకాశవాదులు తమ స్వార్థానికి ఉపయోగించుకున్నారు. మార్క్సిజాన్ని వదలి లెనిన్ వెడదారి పడుతున్నాడని నిందించారు. కాని మార్క్సిజంలో పూర్తిగా ప్రావీణ్యం సంపాదించిన లెనిన శ్రామిక వర్గం సాగించిన నూతన పోరాటానుభవం ద్వారా లెనిన్ మార్క్సిజాన్ని మరింత విజ్ఞాన సంపన్నంగా తయారు చేశాడు. మార్క్సిజాన్ని ఇంకా అభివృద్ధి చేశాడు. మొట్ట మొదట ఒక దేశంలో కూడా సోషలిజం జయిస్తుంది అనే లెనిన్ సిద్ధాంతాన్ని లెనిన్‌కు నిజమైన వారసుడు స్టాలిన్ ఇంకా పురోగమింప చేశాడు. సోషలిస్టు సమాజ నిర్మాణంలో శ్రామికవర్గం నిర్వహించవలసిన జాతీయ, అంతర్జాతీయ కర్తవ్యాల సమైక్యతను, అభిన్నతను చక్కగా నిరూపించాడు. ప్రజాస్వామిక ప్రభుత్వాల్లో అత్యుత్తమ శ్రేణికి చెందిన సోవియట్ ప్రభుత్వ స్వరూపాన్ని శ్రామికవర్గ నియంతృత్వాన్ని గురించి లెనిన్ చేసిన నూతన సిద్ధాంతం కూడా విప్లవంలో చాలా ప్రాముఖ్యత వహిస్తుంది.

కేపిటలిజంనుంచి సమాజం సోషలిజానికి పరివర్తన చెందే సమయంలో పార్లమెంటరీ ప్రజాస్వామిక ప్రభుత్వమే అన్నిటికంటె ఎక్కువ ఉపయోగకరమైనదని అప్పటివరకు వివిధదేశాల్లోని మార్క్సిస్టులందరూ భావించేవాళ్లు. 1905 లో జరిగిన రష్యావిప్లవమూ, ముఖ్యంగా 1917 ఫిబ్రవరిలో జరిగినవిప్లవమూ సమాజంలో ఒక నూతన రాజకీయ సంఘటన (ఆర్గనైజేషన్) యొక్క స్వరూపంవైపు - కార్మిక, రైతు ప్రతినిధుల సోవియట్లవైపు - దృష్టిని ప్రసరింప జేసింది. రష్యాలో జరిగిన రెండు విప్లవాల్లో గడించిన అనుభవంద్వారా, మార్క్సిస్టు సిద్ధాంత విజ్ఞానంద్వారా, శ్రామిక వర్గ నియంతృత్వంయొక్క రాజకీయస్వరూపం (పొలిటికల్ ఫారం) పార్లమెంటరీ ప్రజాస్వామిక ప్రభుత్వం కాదనీ, సోవియట్ ప్రభుత్వ మనీ లెనిన్ ఒక స్పష్టమైన నిర్ణయానికి వచ్చాడు.

శ్రామికుల వర్గపోరాటానుభవం ద్వారా గడించినఅనుభవంతో మార్క్సిజాన్ని ఇతోధి

కంగా అభివృద్ధిచేసి లెనిన్ నిజమైన మార్క్సిస్టుగా రుజువు చేసుకున్నాడు. మార్క్సిజంలో మంచి ప్రావీణ్యత సంపాదించాడు.

మార్క్సిజంయొక్క క్రమాభివృద్ధియే లెనినిజం. శ్రామికవర్గ పోరాటాల్లోని నూతన పరిస్థితులకు సంబంధించిన మార్క్సిజమే లెనినిజం. సామ్రాజ్యవాద యుగానికీ శ్రామిక వర్గ విప్లవ యుగానికీ సంబంధించిన మార్క్సిజమే లెనినిజం. ప్రపంచంలో ఆరోవంతు భూభాగంలో సోషలిస్టు విప్లవంయొక్క విజయసాధనకు సంబంధించిన మార్క్సిజమే లెనినిజం."

(సోవియట్ కమ్యూనిస్టు పార్టి చరిత్ర ఇంగ్లీషు ఎడిషన్, పేజీ ౩౫౮)

కాబట్టే లెనినిస్టుగాకుండా నేడు మార్క్సిస్టు కావడమనేది అసంభవమైన విషయం.

శ్రామిక విప్లవం కోసం సాగించిన పోరాటంలోని ప్రత్యక్షానుభవమూ, సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు సమాజ నిర్మాణానుభవమూ, బోల్షివిక్ పార్టీ సిద్ధాంత ఐక్యతను సాధించడంలో అత్యంత ప్రాముఖ్యత వహిస్తున్నాయి.

కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించిన మాత్రానే సరిపోదు, విప్లవ కార్యక్రమాన్ని కొనసాగించడం, అమలు పరచడం కూడా ప్రతి కమ్యూనిస్టు పార్టీ సభ్యుని కర్తవ్యం. ప్రపంచాన్ని అర్థం చేసుకోవడం మాత్రమే కమ్యూనిస్టుల కర్తవ్యం కాదు. ప్రపంచాన్ని మార్చవలసి ఉంటుంది కూడా. కమ్యూనిస్టుపార్టీ అంటే ఏవో కొన్ని సమాన సిద్ధాంతాలనూ, సూత్రాలనూ అంగీకరించిన కొద్దిమంది సభ్యులు కలిసి ఉండే ఒక గ్రూపు కాదు. తత్వశాస్త్ర గ్రంథాలతో కూడిన ఒక ముఠా కాదు. శ్రామికవర్గ పార్టీ అంటే ప్రత్యక్ష కార్యాచరణలో పాల్గొంటూ శ్రామికవర్గం యొక్క ప్రధాన ప్రయోజనాలను కాపాడే ఒక సుశిక్షిత సైనిక దళంలాంటిది. కాబట్టే స్టాలిన్ ఇలా అన్నాడు.

"పార్టీలు కార్యక్రమాన్ని, ఎత్తుగడలనూ, నిర్మాణసూత్రాలనూ నామమాత్రంగా ఆమోదించడంతో మనపార్టీ సంతృప్తిపడదు... ఆమోదించిన విషయాలను అమలు జరపమని సభ్యులను పార్టీ నిస్సంకోచంగా డిమాండ్ చేయాలి ... మనపార్టీలో సభ్యుడు కాదలచుకున్న ప్రతివ్యక్తి పార్టీ కార్యక్రమాన్నీ, ఎత్తుగడలనూ నిర్మాణసూత్రాలనూ అంగీకరించడంతోనే తన విధులను పరిమితం చేసుకోగూడదు. నిత్యజీవితంలో వాటిని ఆచరించాలి: అమలుపరిచి బాధ్యత తీసుకోవాలి."

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీలో దృఢమైన సిద్ధాంత ఐక్యత ఏర్పడడానికి లెనిన్ స్టాలిన్‌లు చూపిన ఈ పార్టీ జీవిత విధానమే పునాది.

అభ్యుదయ కాముకులైన ప్రపంచ ప్రజలందరిలో నానాటికి మార్క్సిస్టు-లెనినిస్టు భావాలు అతివేగంగా వ్యాపిస్తున్నాయి. ప్రజల ఆదరాభిమానాలను చూరగొంటున్నాయి. పెట్టుబడిదారులూ, భూస్వాములూ లేకుండానే కార్మికులు తమ ప్రయోజనాలకూ, అభీష్టాలకూ అనుగుణంగా తమ జీవి

తాన్ని జయప్రదంగా నిర్మించుకో గలరని సోవియట్ యూనియన్ సాధించిన సోషలిస్టు విజయం రుజువు చేసింది. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టు దేశాలపై సోవియట్ యూనియన్ సాధించిన మహత్తర విజయాల ఫలితంగా, మధ్య యూరప్ దేశాలూ, ఆగ్నేయ యూరప్ దేశాలు పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించాయి. ఆదేశాల్లో ప్రజాస్వామిక ప్రజాతంత్రి ప్రభుత్వాలు ఏర్పాట్టాయి. సోవియట్ చూపిన మార్గాన నడిచి ఈ దేశప్రజలు సోషలిస్టు సమాజం వైపు పురోగమిస్తున్నారు. పల్లెటూళ్ళల్లోని, పట్టణాల్లోని పేద ప్రజల హృదయ పూర్వక సహకారంతో కార్మిక వర్గమే ఈ దేశాల్లో నాయకపాత్ర వహిస్తూ ఉంది. కార్మిక వర్గంలో ఉన్న ఉత్తమ శక్తులూ, వ్యక్తులూ మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీల్లో సంఘటితు లయ్యారు. సోషలిజం వైపు తమ తమ దేశప్రజల నందరినీ పురోగమింప చేయడానికి లెనిన్ మహోన్నత పతాకం క్రింద కార్మికవర్గం ముందుకు సాగిపోతూ ఉంది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నడిచిన పంథానే ఈ దేశాలుకూడా అవలంబించి దినదినాభివృద్ధి చెందుతూ ముందుకు సాగిపోతున్నాయి. కార్మికవర్గంలో ఉత్తమ శ్రేణికి చెందిన జర్మన్ స్త్రీ పురుషులు కూడా ఈ మార్గాన్నే అనుసరించారు. జర్మనీ కమ్యూనిస్టులూ, సోషలిస్టులూ కలిసి ఒకే ఐక్యపార్టీని - సోషలిస్టు యూనిటీ పార్టీని నిర్మించారు. ఈ పార్టీ నిజమైన మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీగా ముందుకు సాగిపోతూ ఉంది.

సోషలిస్టు యూనిటీపార్టీ ప్రథమ సమావేశంలో కామ్రేడ్ ఒట్టో గ్రోత్ వోల్ తన రిపోర్టులో ఇలా చెప్పాడు.

"శ్రామిక వర్గాన్నీ, ఆ వర్గ మిత్రులనూ సోషలిస్టు విజయంవైపు నడిపించగోరే విప్లవపార్టీ తనసభ్యుల్లో శ్రామికవర్గ వ్యతిరేక సిద్ధాంతాలను సహించకూడదు. విప్లవపార్టీ ఎప్పుడూ ఒక విభిన్నశక్తుల కూటమిగా ఉండకూడదు. కార్మికవర్గానికి అగ్రగామిక సైనికదళంగా ఉండాలి. అలాంటి పార్టీలో ఉండే ప్రతి సభ్యుడూ వర్గచైతన్యంతో కూడిన ఒక విప్లవయోధుడుగా ఉండాలి.

జర్మనీలో సోషలిస్ట్ యూనిటీపార్టీ - ఒక కొత్తరకమైనపార్టీ - ఏర్పడిన ఫలితంగా జర్మనీ కార్మికవర్గంలోని ఉత్తమ ప్రతినిధులందరూ సోవియట్, కమ్యూనిస్టుపార్టీ యొక్క మహత్తర పోరాటానుభవాలనుంచీ, కార్మికవర్గ పోరాటానుభవాలనుంచీ అనేక గుణపాఠాలు నేర్చుకుంటున్నారు.

లెనిన్ - స్టాలిన్‌లపార్టీ - సోవియట్ కమ్యూనిస్టుపార్టీ - మనకొక ఉజ్వల ఉదాహరణ రాజకీయంగా, నిర్మాణ రీత్యా, సిద్ధాంతరీత్యా అలాంటి పార్టీని ఎలా నిర్మించాలో అది మనకు దారిచూపుతూ ఉంది."

అని కామ్రేడ్ గ్రోత్ వోల్ ఆ సమావేశంలో ఉద్ఘాటించాడు.

సోషలిజంకోసం, పెట్టుబడిదారీ బానిసత్వంనుంచి విముక్తి చెందడంకోసం పోరాడే కోటానుకోట్ల ప్రజానీకానికి బోల్షివిక్ పార్టీ - లెనిన్ స్టాలిన్‌లపార్టీ - ఒక ధ్రువతార.

[న్యూస్ అండ్ వ్యూస్ ఫ్రం ది సోవియట్ యూనియన్ (21-3-49) నుండి -]

# నవ్యసాహితి (పక్షపత్రిక)

సంపాదకుడు : విద్వాన్ విశ్వం

ప్రచురణ : ప్రతినెలా 5, 20 తేదీలలో

సం. చందా : రు 6-4-0; ½ సం. చందా రు 3-8-0; విడిప్రతి : పావలా; కార్యాలయం : నెహ్రూనగర్, అనంతపురం.

"మూడుముక్కలుగావున్న తెనుగుగడ్డలో ముప్పతిప్పలు పడుతున్న తెనుగుప్రజల్లో ఏకీభావాన్ని కల్పించుటకై, మూడు ప్రాంతాలలోని తెనుగుపదాలను సంతరించి, సర్వజనీనమైన ఆంధ్రభాషను నిర్మించేందుకై పనిచేస్తోంది" అని, ప్రారంభ సంచికలో తన ఆశయాల్లో ఒక దానిని ప్రకటించింది 'నవ్యసాహితి'. ఈ ఆశయం ఆంధ్రైక్యతకు అపారంగా తోడ్పడి, వివిధప్రాంతాల ప్రజలలో స్వార్థపరులు కల్పించిన విభేదాలను, ప్రాంతీయ దురభిమానాలను పోగొట్టి ఆంధ్రాభ్యుదయానికి విశేషంగా దోహదం చేస్తుంది. అయితే 'సర్వజనీయమైన ఆంధ్రభాష' దోపిడీ వ్యవస్థ నిర్మూలింపబడి ప్రజాస్వామిక ప్రజాతంత్ర నిర్మాణం జరగనిదే సాధ్యంకాదు.

ఆంధ్రప్రాంతాలలో, దురదృష్టవశాత్తు రాయలసీమ వెనకబడివుంది. అందుచేత పత్రికా వ్యాప్తికూడా చాలాతక్కువ. ఈ పరిస్థితిలో అనంతపురంనుండి 'నవ్యసాహితి' వంటి ఉత్తమపత్రిక వెలువడి, ప్రజావిజ్ఞాన వ్యాప్తికి కృషిచేయడానికి పూనుకోవడం ముదావహం.

మొదటి సంచికలో కథలు గేయాలతోబాటు 'బొమ్మరిల్లు' 'విజ్ఞానవీధి' 'సంఘమీమాంస' 'లోకాలోకం' 'పసుపుకుంకుమ' మొదలైన శీర్షికలు వున్నాయి. గోర్కీ-వ్యంగకథ సీరియల్‌గా ప్రారంభింపబడింది. తన ఆశయానికి అనుగుణ్యంగా కొనసాగించాలనీ, భాషలో అన్వయకాఠిన్యం లేకుండా చేయాలనీ 'నవ్యసాహితి' ని కోరుతున్నాము.

# వార్తలూ-విశేషాలు

## మార్షల్ ప్లాన్ వలలో ఇండియా

మార్షల్ ప్లాన్ అంటే అమెరికా కోటీశ్వరుల క్రింద బానిసత్వం అని ప్రపంచ ప్రజలందరూ గుర్తిస్తున్నారు. కాని ఇండియాలో నెహ్రూ ప్రభుత్వం మాత్రం మార్షల్ ప్లానుకు కొత్తగా అర్రులు చాస్తూ ఉంది. ఒకసంవత్సరకాలం మార్షల్ ప్లాను అమలు జరిపిన ఫలితాలేమిటో నేడు మనకు పశ్చిమ యూరప్‌లో ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి. ఆ దేశాల్లో పారిశ్రామికోత్పత్తి క్షీణించిపోయింది. బ్రిటన్‌లో నౌకా నిర్మాణం తగ్గిపోయింది; ఫ్రాన్సులో ఫ్యాక్టరీలు మూతబడుతున్నాయి. ఇటలీలో 1948లో జరిగిన మొత్తం పారిశ్రామికోత్పత్తి యుద్ధానికి పూర్వమున్న ఉత్పత్తిలో నూటికి 67 వంతులు మాత్రమే. మార్షల్ ప్లాను ఆక్రమించుకున్న దేశాలన్నిటిలో నిరుద్యోగ సమస్య నానాటికి విషమ రూపం ధరిస్తూ ఉంది. ఉదాహరణకు బెల్జియంలాంటి చిన్నదేశంలో మార్షల్ ప్లాను అమలుపరచి ఒక్క సంవత్సరానికి నిరుద్యోగుల సంఖ్య 26 వేలనుంచి 8 లక్షలవరకు పెరిగింది. అదే విధంగా ఇటలీలో నిరుద్యోగులసంఖ్య 12 లక్షలనుంచి 30 లక్షలయింది. పశ్చిమ జర్మనీలో నిరుద్యోగులు పదిలక్షలకు పైగా ఉన్నారు. మార్షల్ ప్లానులో ఉన్న పశ్చిమ యూరప్‌లో (బెల్జియం, స్విట్ జర్లాండు మినహా) వచ్చేసంవత్సరంకూడా ఆహారంపై రేషనింగు అమలు జరపబడుతోంది;

మార్షల్ ప్లాను సంకెళ్ళలో బంధించబడడానికి తూర్పు యూరప్ దేశాలు అంగీకరించలేదు. ఆ దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంటూ దినదినాభివృద్ధి చెందుతూ సోషలిజంవైపు పురోగమిస్తున్నాయి.

అమెరికాలో మూడోపార్టీ నాయకుడు హెన్రీవాలస్ చెప్పినట్లు మార్షల్ ప్లాను ద్వారా ఆర్థిక పునర్నిర్మాణం జరగదు. సోవియట్ యూనియన్‌కూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలకూ, ప్రపంచప్రజలందరకూ వ్యతిరేకంగా మూడో ప్రపంచ యుద్ధాన్ని రెచ్చగొట్టడమే దాని ఉద్దేశం. మార్షల్ ప్లానులో చిక్కుకున్న దేశాలు అమెరికా పెట్టుబడిదారులక్రింద బానిస దేశాలుగా మాత్రమే తయారవుతాయి.

భారత పెట్టుబడిదారీ వర్గానికి బంటు అయిన నెహ్రూ ప్రభుత్వం ఇండియానుకూడా ఈబోనులో ఇరికించబోతూ ఉంది. భారతదేశానికి వచ్చిన 'స్వాతంత్ర్యం' ఎలాంటిదో సంశయాత్ములకిప్పటికైనా సందేహనివృత్తి కాగలదు.

# అభ్యుదయ పత్రికలపై నిషేధం

## భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రకార్యాలయ ఖండన

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యాలయం ఏప్రిల్ 9వ తేదీన యీ క్రింది ప్రకటన చేసింది:

"పీపుల్స్ ఏజ్" "న్యూ ఏజ్"

పత్రికలకూ, ఆ పత్రికలకీ సంబంధించిన మరికొన్ని దేశభాషా పత్రికలకూ మేనేజింగ్ ఎడిటర్ వి. యమ్ కాత్‌నూ, న్యూ ఏజ్ ప్రింటింగ్ ప్రెస్ మేనేజరు జయంత్ ఘాట్‌నూ బొంబాయిప్రభుత్వం ప్రజారక్షణ చట్టంక్రింద అరెస్టుచేసి డిటెయిన్ చేసింది.

ఈ అరెస్టులకూ, యింతకుముందు యీ కమ్యూనిస్టు, కార్మికవర్గ పత్రికలపై చేసిన దాడులకూ ప్రభుత్వం ఎలాంటి కారణాలనూ తెలియజేయలేదు. ఈ విధంగా కారణం లేకుండా అరెస్టులు చేయడం, దాడులు చేయడం ప్రభుత్వానికి ఒక అలవాటు అయిపోయింది.

"ఈ పత్రికలను నడుపకుండా సంపాదకుని పైనా, యీ పత్రికలను అచ్చువేయరాదని న్యూ ఏజ్ ప్రింటింగ్ ప్రెస్ మేనేజరు మొదట ఒక నెలరోజులకంటూ ఫిబ్రవరి 23వ తేదీన నిషేధాజ్ఞలు జారీచేయబడ్డాయి.

"తిరిగి మార్చి 23వ తేదీన ఎలాంటి కారణాన్నీ తెలుపకుండా యీ నిషేధాజ్ఞలు మరొకమాసం కాలం పొడిగించబడ్డాయి.

"ఇది జరిగిన ఒక పక్షంరోజులు అయిందో లేదో తిరిగి ఏప్రిల్ 5వ తేదీన ఏవిధమైన విషయాన్ని మూడు మాసములవరకూ అచ్చువేయరాదని నిషేధిస్తూ "న్యూ ఏజ్ ప్రింటింగ్ ప్రెస్" మీద మరొక నిషేధాజ్ఞ జారీ చేయబడింది. ఈ ఆజ్ఞ జారీచేయబడిన మూడు రోజుల తరువాత "పీపుల్స్ ఏజ్" మేనేజింగ్ ఎడిటర్‌నూ, "న్యూఏజ్ ప్రింటింగ్ ప్రెస్" మేనేజరును అరెస్టుచేశారు.

"బొంబాయి పోలీసుశాఖామంత్రి శాసనసభలో మాట్లాడుతూ కమ్యూనిస్టు పత్రికను పూర్తిగా నిషేధించే ఉద్దేశం ప్రభుత్వానికి లేదని తెలియజేశాడు. అయితే అతను బహుశా కార్మికవర్గం కోరను కట్టివేయడానికి యిలాంటి ఎత్తుగడలపై ఆధారపడి ఆవిధంగా చెప్పిఉంటాడు. ఫిబ్రవరి ఆఖరివారంలో డొమినియన్ పార్లమెంటులో నెహ్రూ ప్రధాని కమ్యూనిస్టు భావాలు ప్రచారం చేసుకొనేందుకు స్వాతంత్ర్యం ఉంటుందని తన ప్రకటనలో నొక్కినొక్కి మరీ చెప్పాడు. అయితే యిప్పుడు కార్మికవర్గ వా[illegible]సబడ

కుండా చేయడానికి ఫాసిస్టుపద్ధతులు వినియోగించడానికి బూర్జువా ప్రభుత్వానికి స్వాతంత్ర్యం వుంటుందని మాత్రం నేడు అనుభవం ద్వారా మరోసారి రుజువైంది.

“పీపుల్సు ఏజ్”పై తాము మోపే నేరాలేమిటో ప్రజలముందు పెట్టవలసిందిగా ప్రభుత్వ అధికారులను లెక్కలేనన్నిసార్లు సవాలుచేయడం జరిగింది. కాని ప్రభుత్వం యింతవరకూ పత్రికపై ఎలాంటి నేరాన్ని ఆరోపించలేకపోయింది. దీనినిబట్టి చూస్తే కాంగ్రెసు పరిపాలకుల ధనికవర్గాల ప్రయోజనాలను కాపాడే పాలసీనిబట్టి భారత దేశంలో కష్టపడి జీవించే ప్రజలకు అండగా నిలబడి వుండటం ఒక్కటే “పీపుల్సు ఏజ్” పత్రిక చేసిన నేరంలా కనపడుతోంది.

“ఎలాంటి నేరాలూ రుజువు కాకుండా యీ పత్రికలకు నిషేధించడమే, గాకుండా ఒక ప్రయివేటు కంపెనీకి చెందిన ప్రెస్‌ను ఆచరణలో సీలు చేశారు. అది చేసిన పాపమల్లా పట్టసమ్మతంగా నడిచే యీ పత్రికలను అచ్చువేయడమే. ఒక “పీపుల్సు ఏజ్” పత్రికే కాదు: బూర్జువా ప్రభుత్వ పాలసీలను విమర్శించే ఏపత్రికనైనాసరే ప్రచురించనీయరని బొంబాయిలో ప్రచురించబడే “కరెంట్ ఎఫైర్స్ (ఇంగ్లీషు), “పరివర్తన్” (హిందీ), “వర్తమాన్” (మరాఠీ), బహుజన్ సమాజ్ వాది పత్రిక “ఇన్‌కిలాబ్”నూ, ఫార్వర్డ్‌బ్లాక్ ప్రతిక “ఆజాద్ హిందు”నూ నిషేధించడం మూలంగా తేటతెల్లమైంది.

“అభ్యుదయ పత్రికలపై చేసే యీ దాడులను మేము ఖండిస్తున్నాం. ప్రజాతంత్ర భావాలుగల ప్రజలూ, ఇతర పత్రికల సంపాదకులూ యీఫాసిస్టు దాడిని ఖండించడంలో మాతో కలసి రావలసిందిగా కోరుతున్నాం.”

# “కరెంటు ఎఫైర్స్”పత్రిక మేనేజరు ప్రకటన

“కరెంట్ ఎఫైర్స్” (ఇంగ్లీషు)“పరివర్తన్” (హిందీ), “వర్తమాన్” (మరాఠి) పత్రికల మేనేజర్ యీ క్రింది పత్రికా ప్రకటన చేశాడు:

ఈ పత్రికలను ముద్రించే ప్రెస్‌పై యీ పత్రికలను ఏప్రిల్ 23వ తేదీవరకూ అచ్చువేయ రాదంటూ బొంబాయిప్రభుత్వం ఒక నిషేధాజ్ఞను జారీచేసింది. ఈ నిరంకుశ ఆర్డర్‌కు ఎలాంటి కారణాన్ని తెలుపలేదు.

ఈ పత్రికలను నిషేధించక పూర్వమే ఈ పత్రికలు ప్రజలకు అందకుండా చేయడానికి అవసరమైన పద్ధతుల వన్నింటినీ ప్రభుత్వం అవలంబించింది. ఈ పత్రికలు పంపబడిన ప్రతి పాకెట్టునూ బొంబాయిలో అధికారులు ఆపివేశారని ఏజన్సీలనుండి వచ్చిన ఉత్తరాలు తెలుపుతున్నాయి.

మొట్టమొదట పత్రికలు పాఠకులకు అందకుండా చేయడం, ఆతరువాత వాటి ప్రచురణనే నిషేధించడం - యిదీ ప్రభుత్వం జారీ చేస్తున్న ఆర్డర్లలోని అంతరార్థం. ప్రభుత్వం అనుసరించే యీ పద్ధతులను నేను తీవ్రంగా ఖండిస్తున్నా. ఈ మూడు పత్రికలను అచ్చువేసే ప్రెస్‌పై జారీచేసిన యీ నిరంకుశ ఆర్డర్‌ను ఉపసంహరించుకోవలసిందిగా నాతోపాటు డిమాండ్ చేయవలసిందిగా ప్రజలను కోరుతున్నా.

# ప్రపంచ శాంతి మహాసభ

యుద్ధప్రేరేపకులకు వ్యతిరేకంగా ప్రపంచ శాంతికాముక ప్రజలందరూ సంఘటితమవుతున్నారు. అమెరికా సామ్రాజ్యవాదుల దురాక్రమణ ప్లానును చిత్తశుద్ధికలిగిన స్త్రీ పురుషులందరూ తీవ్రంగా నిరసిస్తున్నారు. యుద్ధానంతరం ఆయుధాల్లో తగ్గింపు జరగక పోగా ఆయుధనిర్మాణం మరింత వేగంగా సాగిపోతూ ఉంది. ఫ్రెడరిక్ జోలియట్ క్యూరీ, ఇరెన్ జోలియట్ క్యూరీ, వావిలోవ్ ఖూయీ ఆరగాన్, జీన్ కస్సేట్, మైకేల్ షోలొఖోవ్, అలెగ్జాండర్ ఫాడయేవ్, వాండా వాసిలివ్‌స్కా, మార్టిన్ అండర్సన్ నెక్సో, హోవర్డ్ ఫాస్టు, పాబ్లో నెరూడా, బెర్న్‌హార్ట్ కెల్లర్‌మన్, హీన్‌రిచ్ మన్, జీన్ బొలియర్, ఇటలీ సోషలిస్టుపార్టీ నాయకుడు నెన్నీ మొదలగు ప్రపంచ విఖ్యాత రచయితలూ, విజ్ఞానవేత్తలూ కలిసి మరో ప్రపంచ యుద్ధంకోసం అమెరికా వేసే ప్లానును ఖండిస్తూ ఒక ప్రకటనచేశారు. వివిధదేశాల్లో మొత్తం 8 కోట్ల సభ్యత్వం కలిగిన అంతర్జాతీయ మహిళాసభ అమెరికా దురాక్రమణ ప్లానులను వ్యతిరేకించవలసిందిగా, శాంతి కాముకులైన ప్రపంచ ప్రజలందరికి విజ్ఞప్తిచేసింది.

వివిధదేశాల్లోని కార్మికవర్గాల నాయకులూ, ప్రజాసంఘాల నాయకులూ, కమ్యూనిస్టు నాయకులూ యుద్ధోన్మాదుల ప్లానుల నరికట్టవలసిందిగా విజ్ఞప్తిచేశారు.

## అమెరికా ఒక కాగితపు పులి

'చైనా డైజెస్టు' అనే పత్రిక యుద్ధోన్మాదులను హెచ్చరిస్తూ ఇలా వ్రాసింది:

"మరోయుద్ధానికి సన్నాహాలుచేస్తూఉన్న అమెరికా, మరో వైపునుంచి తనకు చైనాలో కలుగుతూన్న ఓటమిని కానలేకుండా ఉంది. క్యుమింటాంగ్‌కు కావలసిన ఆయుధాలనూ, డాలర్లనూ కుప్పతిప్పలుగా అందచేసినా, చైనా విముక్తిసైన్యాల పురోగమనాన్ని అరికట్టలేకపోయింది. చైనా ప్రజావిజయం ప్రపంచశక్తుల బలాబలాల్లో గొప్ప మార్పు తీసుకరాగలదు. సోవియట్ యూనియన్ అధ్వర్యాన నడుస్తూవున్న ప్రపంచశాంతి ప్రజాస్వామికశిబిరాన్ని చైనా ప్రజలు పూర్తిగా బలపరుస్తారు. అమెరికా తన ఆయుధ సంపత్తినీ, ధనసంపత్తినీ విరివిగా ఉపయోగించికూడా చైనాలో అభివృద్ధి నిరోధక క్యుమింటాంగ్ కూటమిని నిలబెట్టలేకపోయిందంటే ప్రపంచాధిపత్యం కోసం అమెరికా వేసే ఎత్తుగడలన్నీ, ప్రయత్నాలన్నీ భగ్నమవుతాయి, అనడంలో ఎట్టి సందేహం లేదు. అయితే ఇందుకు శాంతికాముక ప్రజలందరూ తీవ్రంగా ఇప్పటినుంచే కృషిచేయవలసిఉంటుంది. ఏప్రిల్ 20 వ తేదీన ప్యారిసులో జరగబోయే ప్రపంచశాంతిమహాసభకు మా పత్రిక తరఫున హృదయపూర్వ కాభివందనాలందజేస్తూ ఆ సభ దిగ్విజయంగా జరగాలని కోరుతున్నాం. ప్రపంచ ప్రజాశక్తుల బలం త్వరలోనే అమెరికా 'కాగితపు పులులను' (పేపర్ టైగర్సు) అంతం చేస్తుందని ఆశిస్తున్నాం".

నోటు— అఖిలభారత ప్రజానాట్యమండలి అలహాబాద్ సమావేశంలో నిర్ణయించిన ప్రకారం, మే నెల మూడోవారంలో శాంతిసంస్కృతుల సంరక్షణకై అఖిలభారత మేధావులసభ బొంబాయిలో జరుగుతుంది.

ఇదే సమయంలో బొంబాయిలో అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘంకూడా సమావేశం అవుతుంది. అఖిలభారత ప్రజానాట్య మండలి, అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం, సోవియట్ మిత్రమండలి తరఫున భారతదేశంలోవున్న శాంతి కాముకులూ, రచయితలూ, కవులూ కళావేత్తలూ, విజ్ఞాన వేత్తలూ, పత్రికా రచయితలూ ఈ సభలో పాల్గొని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాం.

# సోవియట్ యూనియన్‌లో ధరల తగ్గింపు

పెట్టుబడిదారీ దేశాల్లో జీవితావసర వస్తువుల ధరలురోజురోజుకూ పెరిగిపోతున్నాయి. నోట్లముమ్మరం, నిరుద్యోగం, జీతాల తగ్గింపు ధరల పెరుగుదల, ఉత్పత్తి తగ్గుదల, వగైరా సమస్యలు పెట్టుబడిదారీ ప్రపంచంలో దీర్ఘ వ్యాధులుగా పరిణమించాయి. కాని ఆదేశాల్లోని పెట్టుబడిదారులు మాత్రం ఇదివరకంటె ఇంకా ఎక్కువగా తమ సంచులు నింపుకుంటున్నారు. నేడు మన దేశంలో ఉన్న పరిస్థితి కూడా ఇదే.

కాని సోషలిస్టు భూమి అయిన సోవియట్ యూనియన్‌లో పరిస్థితులు ఇందుకు పూర్తిగా విభిన్నంగా ఉన్నాయి. అక్కడ నోట్ల ముమ్మరం అంటూలేదు. నిరుద్యోగ సమస్య అసలేలేదు. ఉత్పత్తి తగ్గిపోవడం అంటూలేదు. అసలు అక్కడ పెట్టుబడిదారీ వర్గమేలేదు. మార్చి 1 వ తేదీ నుంచి ధరలు ఇంకాతగ్గించడం జరిగింది. (ధరలు తగ్గింపులో ఇది రెండో మెట్టు.).

1947 వ సంవత్సరం ఆఖరుకే రేషనింగు పూర్తిగా రద్దుచేయ బడింది.

జీవితావసర వస్తువుల్లో మొదటి దశలో 5700 కోట్ల రూబుల్సు విలువకు గల ధరలు తగ్గించ బడ్డాయి. ఆ మొత్తం నష్టాన్ని అంతా ప్రభుత్వమే భరించి సరకులనధికంగా ఉత్పత్తి చేయడం, ఉత్పత్తి ఖర్చులు తగ్గించడంవగైరా పద్ధతుల ద్వారా ప్రభుత్వం ఆ నష్టాన్ని భర్తీ చేసుకుంది. ఒక్క 1948వ సంవత్సరంలోనే ప్రజలకు మొత్తం 8600 కోట్ల రూబుల్సు మిగిలాయి. ధరల తగ్గింపుయొక్క మొదటిదశలోనే రూబుల్సుకొనుగోలు విలువ హెచ్చింది.

సోవియట్ జాతీయాదాయం పెరగడం వల్లనూ ఉత్పత్తిని అధికంచేయడం వల్లను, ఉత్పత్తి ఖర్చుల తగ్గింపు వల్లనూ ధరల తగ్గింపులో రెండోదశ - రెండో మెట్టు - సాధ్యమయింది. ఇందువల్ల ఒక్క 1949వ సంవత్సరంలోనే సోవియట్ ప్రజలకు 7100 కోట్ల రుబుల్స్ మిగులుతాయి. రుబుల్ విలువఇంకా హెచ్చుతుంది. తత్ఫలితంగా కార్మికుల, మేధావుల ఆదాయం మరింత పెరుగుతుంది. ఈవిధంగా తమ జీవనస్థాయి రోజురోజుకూ అభివృద్ధిచెందుతూ ఉన్నందుకు సోవియట్ ప్రజలు అమితానందోత్సాహాలు వెళ్ళడిస్తున్నారు.

ఇక పెట్టుబడిదారీ దేశాల్లో - నెహ్రూ ఆధ్వర్యాన మనదేశంలోకూడా - ఉత్పత్తి రోజురోజుకూ తగ్గిపోతూంది. నిరుద్యోగ సమస్య మరింత తీవ్రరూపం ధరిస్తోంది. నోట్ల ముమ్మరం ఫలితంగా కార్మికుల నిజమైన వేత

నాలు తగ్గిపోతున్నాయి. ప్రజల్లో కొనుగోలు శక్తి పడిపోతూఉంది.

కోటీశ్వరుల దేశం అనుకునే అమెరికాలో ప్రతి ఏడుగురిలో ఒకడు తిండిలేక పస్తులు పండుకొంటున్నాడు. రైతాంగంలో మూడింట రెండు వంతులకు సరియైనతిండి లభ్యం కావడంలేదు. గ్రామీణుల్లో కొన్ని లక్షలమంది మాత్రమే తమ కనీస అవసరాలతో కాలం గడుపుకుంటు న్నారు. కాని మరోవైపు కొద్దిమంది అమెరికా పెట్టుబడదారులు మాత్రం కోటికి పడగలెత్తుతున్నారు.

పెట్టుబడిదారీ విధానం ఉన్నంతకాలం ప్రజలకు దారిద్ర్యం, దోపిడీ తప్పవు. సోష లిజంలో మాత్రమే ప్రజల సృజనాత్మక శక్తులు సంపూర్ణంగా వికసిస్తాయి. జీవనప్రమాణం పెరుగుతుంది. ప్రజలంతా సుఖంగా జీవిస్తారు. అధికలాభాలను అరికట్టినప్పుడే నోట్లముద్ర ణాన్ని కూడా అరికట్టడం సాధ్యమవుతుంది. ఉత్పత్తి పెరుగుతుంది. జీవితావసర వస్తువుల ధరల్లో తగ్గింపు జరుగుతుంది.

## యు. పి. ఎన్నికలలో కమ్యూనిస్టులకు అఖండ విజయం

యు. పి. లోని బాలియాజిల్లాకు సంబం ధించిన 40 పంచాయితీల (మొత్తం 150 గ్రామాల్లో) ఎన్నికల్లో కమ్యూనిస్టుపార్టీ 1600 స్థానాలకు, అంటే దాదాపు అన్నిస్థానా లకు పోటీచేసింది. 1600 స్థానాల్లో 1500 స్థానాలు కమ్యూనిస్టుపార్టీకే లభించాయి.

రైతుల్లో, వ్యవసాయకూలీల్లో నూటికి 98 మంది కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థులకే ఓటు చేశారు.

సుల్తాన్‌పుర్ జిల్లాలో జరిగిన ఎన్నికల్లో ఇప్పటికి నాలుగు పంచాయితీల ఫలితాలు మాత్రమే ప్రకటించబడ్డాయి. ఈ నాలుగు పంచాయితీల్లో కమ్యూనిస్టులకే పూర్తిగా విజయం కలిగిందనీ, ఈ పంచాయితీలకు అధ్య క్షులు (సర్‌పంచ)గా కమ్యూనిస్టులే ఎన్నుకో బడ్డారని ఇప్పటివరకు వచ్చిన వార్తలద్వారా తెలుస్తూఉంది.

(హిందూ 13-4-49)

## పీపుల్సు పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్ మేనేజింగ్ డైరక్టరు నిరసన

పీపుల్సు పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్ లాంటి ప్రయివేట్ కంపెనీకి చెందిన ప్రెస్‌ను నిషేధించడాన్ని ఖండిస్తూ యీ నిరంకుశ ఆజ్ఞకు ప్రజలంతా తమ అసమ్మతిని తెలియ పరచవలసిందిగా కోరుతూ కంపెనీ మేనే జింగ్ డైరక్టర్ ఒక ప్రకటన చేశాడు.

## చైనాలో:

# శాంతి రాయబారాలు

పీపింగులోని న్యూ చైనా రేడియో ద్వారా, మార్చి 27 వ తేదీన చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అభివృద్ధి నిరోధక క్యుమింటాంగ్ ప్రభుత్వంతో శాంతి సంప్రదింపులకు తమ అంగీకారాన్ని ప్రకటించింది. ఏప్రిల్ 1 వ తేదీన పీపింగులో సమావేశం జరగాలని స్థల కాల నిర్ణయాన్ని కూడా తెలియజేసింది. చౌ-ఎన్-లై, లిన్-సుహాన్, లిన్-పియావో, యు-చిన్-ఇంగ్, లి-వే-హాన్, నీ-యాంగ్-జన్ అనే ఈ ఆరుగురూ కమ్యూనిస్టుపార్టీ తరఫున సంప్రదింపుల్లో పాల్గొంటారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ ఈరోజు చైనా దేశాన్ని అనంతనూ తీవ్రప్రతిఘటన లేకుండానే ఆక్రమించుకోగల పరిస్థితిలో ఉంది. అయినా శాంతి రాయబారాలకు కమ్యూనిస్టులు అంగీకరించారంటే నిజమైన శాంతి కోసం వారెంత చిత్తశుద్ధిగా ప్రయత్నిస్తూ ఉన్నారో తేటతెల్లమవుతుంది. శాంతి కావాలని నాన్‌కింగ్ అధికారులు ఎంతగా గొంతు చించుకుంటున్నా వారు తమ నిజాయితీని ఇంతవరకు ఏమాత్రం రుజువు చేసుకోలేదు. పీపింగ్ పతనం కావడానికి సిద్ధంగావున్న సమయంలో - నాన్‌కింగ్ కూడా ప్రమాద స్థితిలో ఉన్నప్పుడు నాన్‌కింగ్ ప్రభుత్వం మొదటిసారి శాంతి సూచనలను ప్రారంభించింది. ఉప్పెత్తుగా ముంచుకువస్తూఉన్న ప్రజాసైన్య విజృంభణను తట్టుకోలేక మళ్ళీ కొంత ఊపిరిపీల్చుకొనే అవకాశాన్ని చేజిక్కించుకొనేందుకు నాన్‌కింగ్ ప్రభుత్వం ఈ శాంతి రాయబారాల నుద్దేశించింది. ఛియాంగ్‌కేషేక్ తాత్కాలికంగా పదవి నుంచి విరమించుకోడంకూడా ఒక ఎత్తుగడే. లీసుంగ్ జెన్ ద్వారా కమ్యూనిస్టులతో సంప్రదింపులు సాగిస్తూ మరోవైపు ఛియాంగ్ కే షేక్ దక్షిణ చైనాలో చురుకుగా యుద్ధ ప్రయత్నాలు చేయసాగాడు. గత 20 సంవత్సరాలనుండి క్యుమింటాంగ్ చేసే మోసపు ఎత్తుగడలను తెలిసివుండి కూడా అష్టసూత్ర ప్రాతిపదికపై సంప్రదింపులు కొనసాగించడానికి, చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుడు కామ్రేడ్ మావ్ అంగీకరించాడు. ప్రజలను కష్టాలనుండీ యుద్ధనష్టాలనుండీ త్వరగా విముక్తులను చేయడానికే కమ్యూనిస్టుపార్టీ ఈ సంప్రదింపులకు అంగీకరించింది. కామ్రేడ్ మావ్ సూచించిన ఎనిమిది సూత్రాల ద్వారానే చైనాలో నిజమైన శాంతి ఏర్పడగలదు. అన్యథా ప్రజావిప్లవాశయాలే భగ్నమైపోతాయి.

శాంతి సంప్రదింపులకు ప్రాతిపదిక అష్టసూత్ర ప్రణాళికను లీ సుంగ్ జెన్ మాటల్లో అంగీకరించాడు. క్యుమింటాంగ్ చైనాలో వెంటనే కొన్ని రాజకీయ సంస్కరణల నమలు జరుపుతామని కూడా లీ ప్రకటించాడు. కాని ఇవన్నీ మాటల్లోనే. క్రియలో మాత్రం శూన్యం. ఛియాంగ్ లాగానే లీ సుంగ్ కూడా ఇంకా ఎక్కువసహాయం అందజేయాలని అమెరికాకు విజ్ఞప్తులపై విజ్ఞప్తులు చేస్తున్నాడు. అమెరికా కూడా ఇంకా అత్యధికంగా ఆర్థిక సహాయం చేయడానికి తన సంసిద్ధతను ప్రకటించింది.

లీ సుంగ్ ప్రభుత్వం ప్రతి చిన్న విషయంలోనూ ఛియాంగ్ సలహాలు తీసుకుంటూనే

ఉంది. ప్రధాన మంత్రి గాక పూర్వం హో యింగ్ చిన్ కూడా అనేకసార్లు చికోవ్ వెళ్ళి ఛియాంగ్‌ను దర్శించుకొని వచ్చాడు. క్యుమింటాంగ్ తరఫున నియమించబడి రాయబార కమిటీకి అధ్యక్షుడైన చాంగ్ చీ చుంగ్ కూడా శాంతి సంప్రదింపుల కోసం పీపింగుకు బయలు దేరే పూర్వం చియాంగ్ కై షేక్‌తో ముందే సంప్రతించాడు. శాంతి రాయబారాలు అనే తెరమరుగున క్యుమింటాంగ్ సైనికాధికారులు తీవ్రంగా యుద్ధ ప్రయత్నాలు సాగిస్తోన్నారు. బలమైన నాలుగువందల డివిజన్ల సైన్యాన్ని నిర్మించడమే శాంతిరాయబారాల అంతరార్థమని శ్రీ సుంగ్ జెన్‌కు అత్యంత విశ్వాసపాత్రుడైన పేచుంగ్ సీ అనే సైన్యాధికారి బహిరంగంగానే ప్రకటించాడు. క్యుమింటాంగ్ చైనాలో సైనిక ఖర్చులకోసం డబ్బూ, ఆహార పదార్థాలూ, ఇంకా అధికంగా, నిర్భంధంగా వసూలు చేయబడుతున్నాయి.

ఛియాంగ్ పదవీ విరమణ జరిగిన తర్వాత కూడా క్యుమింటాంగ్ చైనాలో రాజకీయ వక్తులపై మరింత తీవ్రదాడులు జరుతున్నాయి నాన్‌కింగులో ఇటీవలే ఒకపత్రికా సంపాదకుని ఉరితీయడం, మరో పత్రికా విలేఖరిని కాల్చివేయడం జరిగింది. కార్మిక నాయకులపై అమానుషహింసాకాండ జరుగుతూనే ఉంది. శాంతి సంప్రతింపుల కమిటీ పీపింగుకు బయలు దేరే రోజునే అరువేలమంది విద్యార్థులు శాంతి ఏర్పడాలి అని జరిపిన ప్రదర్శనంపై కాల్పులు జరిగాయి. ఈ కాల్పుల ఫలితంగా ఇద్దరు విద్యార్థులు చనిపోవడం, 85 గురు గాయపడడం జరిగింది.

క్యుమింటాంగ్ ఆధ్వర్యాన ఫార్మోజా రోజురోజుకూ కమ్యూనిస్టు వ్యతిరేక మిలటరీ కేంద్రంగా తయారవుతూ ఉంది. యుద్ధ సామగ్రి నధికంగా కొని ఫ్రెంచి ఇండోచైనా ద్వారా క్యుమింటాంగ్ చైనాకు దిగుమతి చేయడానికే టి. వి. సూంగ్ ఇటీవల ఫ్రాన్సుకు వెళ్ళాడు.

కాబట్టి పైచెప్పిన విషయాలన్నీ ఏమి తెలియజేస్తున్నాయి? క్యుమింటాంగ్ చైనా నిజమైన శాంతిని కోరడంలేదని స్పష్టంగా తేలిపోతుంది. రెండు నాలుకలతో వ్యవహరించే క్యుమింటాంగ్ నిజమైన శాంతికి అంగీకరిస్తుంది అనుకోవడం చాలా సందేహాస్పదమైన విషయం. అయినప్పటికి తన విప్లవాశయాలకు లోటు వాటిల్లనంతవరకు శాంతి సంప్రతింపులకొరకు కమ్యూనిస్టుపార్టీ ఎప్పుడూ సంసిద్ధంగానే ఉంది. ఈ శాంతి సంప్రతింపులు భగ్నమైన పక్షంలో మొత్తం చైనానంతను ఒక సంవత్సరంలోపుగానే కమ్యూనిస్టుపార్టీ గెలుస్తుంది. క్యుమింటాంగ్ అధికారమూ, అమెరికా పెత్తనము చైనా భూమినుంచి పూర్తిగా శాశ్వతంగా తుడిచిపెట్టడం జరుగుతుంది.

"చైనా డైజెస్టు"నుండి
(15-4-49)

# 'జనత' మేనేజర్ విడుదల

14-3-49 న విజయవాడ 'జనత' బ్రాంచి ఆఫీసుపై దాడి జరిగిన సందర్భంలో అరెస్టు చేయబడిన జనత ఆఫీసు మేనేజరు శ్రీ యస్. ఆనందరావుగారినీ, అభ్యుదయ రచయిత శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారినీ, కడపజిల్లా 'జనత' ఏజెంటు కొండయ్యగారినీ 15 రోజులపాటు రిమాండులో ఉంచి 29-3-49 న విడుదలచేశారు.

# రెండు ప్రధాన సిద్ధాంత వ్యాసాలు

## ప్రజాస్వామిక ప్రజాతంత్రం

మనం ప్రజాతంత్ర విప్లవదశలో ఉన్నామా ? లేక సోషలిస్టు విప్లవదశలో ఉన్నామా ? ఈ రోజున మన నినాదం ఏది? శ్రామికవర్గ నియంతృత్వమా? లేక కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వమా ? భారతదేశం లోని ప్రజాతంత్ర సంఘటనలో ఏయేవర్గాలు వుంటాయి ? ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం ఏయే వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది ? ప్రస్తుత భారతపరిస్థితుల్లో పెటీబూర్జువాకు ఏమైనా విప్లవకరపాత్ర ఉందా ? ఇవన్నీ — ఈ వ్యాసంలో క్షుణ్ణంగా చర్చించబడ్డాయి.

## భారత వ్యవసాయ సమస్య

పారిశ్రామికంగానూ, వ్యావసాయికంగానూ చాల వెనుకబడివున్న వలస, అర్ధవలసదేశాలు రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా ముందుకు పురోగమించాలంటే వ్యావసాయిక విప్లవం తప్పనిసరి అవుతుంది. ఈ వ్యాసం భారత వ్యవసాయ సమస్యను కూలంకషంగా చర్చించి రైతాంగంలోని ఏయే వర్గం వ్యావసాయిక విప్లవంలో ఏయే పాత్ర నిర్వహిస్తుందో వివరిస్తుంది. ప్రస్తుతదశలో వ్యవసాయరంగంలో మన ప్రధాన బాధ్యతలను గురించి విస్పష్టంగా తెలియజేస్తుంది.

ఈ రెండు ప్రధాన సిద్ధాంత వ్యాసాలూ అందరూ తప్పక అధ్యయనంచేయాలి. ఈవ్యాసాలు ప్రకటించబడిన **జనత ౮వ సంచిక** ఇక కొద్ది కాపీలు మాత్రమే ఉన్నాయి. వెంటనే ఆర్డర్లు ఇవ్వండి.

79

# మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలు

"జనత" పాఠకులు తమకున్న మార్క్సిస్టు పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలంటే తెలుగులో ప్రచురించబడిన యీ క్రింది సిద్ధాంత గ్రంథాలను అధ్యయనం చేయడం ఎంతో అవసరం.

1. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర 4-0-0
2. ఏమి చేయాలి? —లెనిన్ 1-12-0
3. లెనినిజం (పద్ధతి, సిద్ధాంతం) —స్టాలిన్ 0-8-0
4. లెనినిజం (వ్యూహం-ఎత్తుగడలు) —స్టాలిన్ 0-4-0
5. మార్క్సిజం అంటేఏమిటి? —ఎమిల్ బర్న్స్ 0-12-0
6. మార్క్సిస్టు మూలసూత్రాలు —నండూరి ప్రసాదరావు 2-0-0
7. అర్థశాస్త్రం —లియాన్ టీవ్ 3-0-0
8. సామ్రాజ్యవాదం —లెనిన్ 1-8-0
9. నేటిభారత దేశం —రజనీపామీదత్తు 7-0-0
10. పల్లెటూరి పేదలకు —లెనిన్ 0-8-0
11. సోషలిజం - ఊహాజనితం — శాస్త్రీయం —ఎంగెల్సు 1-4-0
12. నిర్మాణ సమస్యలు —స్టాలిన్ 0-4-0
13. భారతకమ్యూనిస్టుపార్టీ —నిబంధనావళి 0-4-0
14. జాతులసమస్య —స్టాలిన్ 1-0-0
15. కళలూ, సారస్వతం ఎవరికోసం? —మాసియాంగ్ 0-8-0
16. ప్రజానాయకుడు స్టాలిన్ —యారస్లావ్‌స్కీ 1-0-0

ప్రాప్తిస్థానం:
లీలా బుక్ డిపో
గవర్నరుపేట — విజయవాడ.

Edited, Printed and Published by Gangineni Venkateswara Rao Guntur
Printed at Rasatarangini Press, Vijayawada.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M113 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, BC1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |